బాలానంద బొమ్మల

# పరమానందయ్య శిష్యులు

సంపూర్ణ హాస్య కథలు






రచన

రేవళ్ళ సూర్యనారాయణమూర్తి

నవరత్న బుక్ సెంటర్

ఏలూరు రోడ్, విజయవాడ - 2.

బాలానంద బొమ్మల

పరమానందయ్య శిష్యులు

రచన :
రేవళ్ళ సూర్యనారాయణమూర్తి

ప్రథమ ముద్రణ :
జనవరి-1999

ముఖచిత్రం, లోపలి బొమ్మలు :
వి. యస్. ప్రకాష్



ముద్రణ :
శ్రీరామా ప్రింటర్స్
విజయవాడ-2.

వెల : రు. **25-00**

/2/

# ఒ క మా ట

బా ల లూ !

మన ఆంధ్రప్రదేశ్‌లో "పరమానంద శిష్యుల కథలు" చిరకాలం నుండి మంచి ప్రచారంలో వున్నాయి. ఈ కథలు మీకు తెలుసునో తెలియదో కాని పెద్ద లందరకు తెలుసు.

ఎవరైనా తెలివి తక్కువ పనులుచేస్తే "వీడు పరమానంద శిష్యుడురా అనే బిరుదము యిస్తారు. అంటే పరమానంద శిష్యులు అంటే తెలివి లేనివారని మీరు సులభంగా గ్రహించవచ్చు.

తెలివి తక్కువవాళ్ళు చేసే కొన్ని పనులు వినేవారికి నవ్వు పుట్టిస్తాయి. కొన్ని సందర్భాల్లో వారు చేసే పనులు చిరాకు కలిగిస్తాయి. మరికొన్ని సందర్భా లలో అసహ్యం, కోపం కూడా కలిగిస్తాయి.

ఏమైనా మొత్తానికి పరమానంద శిష్యుల కథలు కొంత వినోదదాయ కంగా ఉంటాయి. అందువల్లనే ఆ కథలు మనరాష్ట్రంలో మంచి వ్యాప్తి కలిగి వున్నాయి. అటువంటి కథలు వినడానికి మీలో చాలామంది ఉవ్విళ్ళూరుతూ వుం టారు. అటువంటి వారికి ఉపయోగపడాలనే తలంపుతో నాకు జ్ఞాపకం వున్న పరమానంద శిష్యుల కథలు కొన్ని ఈ పుస్తకంలో వ్రాసాను. నా రచనను స్వీక రించి, చక్కని చిత్రపటములు కూడాచేర్చి, ముచ్చటైన నాలుగురంగుల ముఖ చిత్రంతో ప్రచురించిన బి. కె. ఆర్. మూర్తి (విజయవాడ) వారికి నా ధన్య వాదములు తెలుపుకొంటున్నాను.

రేవళ్ళ సూర్యనారాయణమూర్తి

# విషయ సూచిక

# పరమానందయ్యశిష్యులు

## (సంపూర్ణ హాస్యకథలు)

## పరమానందయ్యగారి వంశ చరిత్ర

పూర్వం త్రిలింగదేశమని పేరుపొందిన మన ఆంధ్ర దేశంలో పరమానందపురం అనే గ్రామం ఒకటి వుండేది. ఆ గ్రామంలో పరమానందయ్య అనే సద్బ్రాహ్మణుడు నివసిస్తూ వుండేవాడు. ఆయన కుటుంబం చిరకాలంనుండి పండిత కుటుంబమని పేరు కలిగి వుంది.

పరమానందయ్య తండ్రి-తాతవలె వేద శాస్త్రములు అభ్యసించినవాడు కాడు పండితుడు అసలేకాడు. తండ్రి బలవంతంపై ఏదో సామాన్య విద్య నభ్యసించినాడు. కాని చదివింది క్షణంలో మరచిపోయి యథాస్థితిలో వుండేవాడు. పండిత కుటుంబములో పుట్టిన అదృష్టవంతుడు కనుక గ్రామస్థులు ఆయనను గౌరవంగా చూస్తూ వుండేవారు.

ఆ చుట్టుప్రక్కలనున్న ముప్ఫయికి పైగా గ్రామాలలో బ్రాహ్మణ కుటుంబాలే లేవు. కనుక పరమానందయ్యగారి కుటుంబం తమకు వరప్రసాదమని ప్రజలు భావించేవారు అట్టి భావనతో శుభాశుభకార్యములు ఏవి కలిగినా వారి సలహా ప్రకారం చేసి సత్కరించేవారు. ఆ కుటుంబ పోషణకు అవసరమైన ధాన్యాదీ, పప్పులు, కూరగాయలు, ఉప్పు, చింతపండు వగైరాలు యథాశక్తిగా

యిచ్చేవారు. ఈ విధంగా గ్రామస్థుల ఆదరణాభిమానములు పొందిన పరమానందయ్యగారి కుటుంబం చీకూ, చింతలేకుండా హాయిగా కాలం గడిపి వేస్తున్నది.



పరమానందయ్య దంపతులు

## పరమానందయ్యగారి ప్రతిభా విశేషాలు

తండ్రిపోయిన తరువాత పరమానందయ్యగారు ఆ గ్రామములోని వారందరికి గురువులైనారు. పరమ పూజ్యులైనారు. చెట్టులేని దేశంలో ఆము

దపు వృక్షమే మహావృక్షంగా భావించబడుతుందన్నట్లు పండితుడు లేని ఆ చుట్టు ప్రక్కల గ్రామాల నివారు పరమానందులవారినే గురుదేవుడుగా భావించేవారు ఆయన చెప్పిన మాట వేదవాక్యంగా భావించేవారు.

సహజంగా గ్రామస్తులు అమాయకులు. తాము నమ్మిన వారిని భగవంతుని వలె చూచి గౌరవిస్తారు. కావున తాము ఏ పని చేయదలచినా ముందు పరమానందుల వారికి చెప్పి, వారు సూచించిన ప్రకారం...కాదు, ఆజ్ఞాపించిన ప్రకారం చేసేవారు.

పరమానందులవారు కూడా వైద్యం చేస్తుండేవారు. అదృష్ట జాతకులు బ్రతికి బట్టకట్టేవారు. అదృష్ట జాగులేనివారు పరలోకమునకుపోయి సుఖించేవారు. ఆయనవద్ద చికిత్స పొందినవారిలో అధిక సంఖ్యాకులు త్వరగా, సునాయాసంగా, వైకుంఠానికి పోయేవారు. అయినా ప్రజలు ఆయన వైద్య విషయంలో అనుమాన పడేవారు కాదు. ఆయుష్షులేకపోతే ఆయనమాత్రం ఏం చేస్తారు? అని సంతృప్తి పడేవారు. కాని ఆయనను పల్లెత్తుమాట అనేవారుకాదు. ఎలా అనగలరు?

గురుబ్రహ్మ గురువిష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః

అని పూర్వం నుండి మన పవిత్ర భారతదేశంలో, గురువులు భావింప బడుతూ వస్తున్నారు. అటువంటి పరబ్రహ్మస్వరూపుడయిన గురువును వారు ఎలా తప్పు పట్టగలరు? పరబ్రహ్మ స్వరూపుడయిన గురువు తప్పుచేస్తాడని గాని, తప్పు చెపుతాడనిగాని ఎవరనుకుంటారు? గురువును చులకనగా చూస్తేపుట్టగతులుంటాయా?

ఈ ఆనవాయితీ ననుసరించి ఆ చుట్టుప్రక్కలగ్రామములలోని వారంతా పరమానందయ్యగారిని తమ గురువుగా భావించి, గౌరవించి పోషిస్తున్నారంటే ఆశ్చర్యపడవలసిన విషయంకాదు. తమకు బ్రాహ్మణ దిక్కులేనిలోటు కలుగకుండా వారి కుటుంబాన్ని పోషించి రక్షించుకొంటున్నారు. కొండంత ప్రజాబలంతో పరమానందయ్యగారు ఆ ప్రాంతంలో మకుటంలేని మహారాజుగా చలామణి అవుతున్నారు. వారి సతీమణి సుందరమ్మగారు మహారాణివలె భోగభాగ్యాలతో తులతూగుతూ ఆనందిస్తున్నారు.

ఇలా జరుగుతూ వుండగా ఆయన కర్మకాలో, అదృష్టం వల్లో పండ్రెండు మంది బ్రహ్మచారులు శిష్యులుగా వున్నారు. వారివల్ల ఆయన పేరుప్రతిష్ఠలు దిన దినాభివృద్ధిపొంది ఆంధ్రభూమి నలుచరగులా వ్యాపించాయి. ఆయన శిష్యులఖ్యాతి ఆచంద్రతారార్కంగా నిలిచిపోయేలా వుంది. వారికంతకీర్తి ఎలా కలిగిందో, వారు చేసిన ఘనకార్యము లెట్టివో తెలిసికొనుటకు ఉవ్విళ్ళూరుతూ వుంటారు కావున చదివి గ్రహింతురు గాక!

## శిష్యులతో పొరుగూరికి ప్రయాణం

పరమానందపురంలో శ్రీ పరమానందయ్యగారు తమ పండ్రెండుగురు శిష్యులతో కాలక్షేపం చేస్తుండగా ఒకనాడు ఆయనకు చుట్టుప్రక్కల గ్రామములకు పోయి, శిష్యులనుండి ధన, కనక, వస్తువాహనాదులు సేకరించుకొనవలెననే తలంపు కలిగింది. అట్టి తలంపు కలిగిన వెంటనే పంచాంగంచూసి ప్రయాణానికి ముహూర్తం పెట్టారు. ఆ శుభ ముహూర్తమున సతీ శిష్య సమేతంగా బయలుదేరారు. ఆ విధంగా వెళ్ళి ఆయన అనేక గ్రామాలు తిరిగి శిష్యవర్గంనుంచి విశేష ధనధాన్యములు విరాళంగా స్వీకరించారు. గ్రామస్తులు యిచ్చిన ధనధాన్యములను చిన్న చిన్న మూటలుగా కట్టి శిష్యులకు తలకొకమూట యిచ్చారు. శిష్యులు ఆ మూటలను తలలపై పెట్టుకొని గురువుగారి వెనుక తిరుగు ప్రయాణం సాగించారు. గురువుగారు ఒక

రైతు తాలూకు బండిలో ప్రయాణం సాగిస్తున్నారు. వారి వెనుక శిష్యులు నడిచి వెళుతున్నారు.



శిష్యులతో ప్రయాణం సాగిస్తున్న పరమానందయ్య

వారు చాలాసేపు ప్రయాణం సాగించారు. ఇంతలో సాయంత్రంఅయింది. వారికి ఒక ఏరు అడ్డమైంది. అది మోకాలిలోతు నీరు కలిగి జోరుగా ప్రవహిస్తున్నది. బండిలో ప్రయాణం సాగిస్తున్న గురువుగారు సతీసమేతంగా క్రిందికిదిగారు. బండిని త్రిప్పి రైతు వెనుకకు మళ్ళిపోయాడు.

వీటిని చూడగానే గురువుగారికి గొప్ప సందేహం కలిగింది. "ఈ ఏటికి కాస్తయినా బుద్ధి వుందో లేదో? మేము వెళ్ళినప్పుడు పాదాలు కూడా తడవనంత తక్కువనీరు కలిగి వుంది. ఇప్పుడు ఎంతో నీరు కలిగి జోరుగా పారుతున్నది. ఇంత మంది శిష్యులతో-ఇన్ని సామాను మూటలతో వస్తున్న నన్ను చూచి ఈర్ష్యపడి పొంగి పొర్లుతోంది. నా ప్రయాణానికి అడ్డుపడాలనే దుర్బుద్ధితోనే ఇది ఇలాచేసింది. ఎంతసేపు అడ్డుపడుతుందో చూస్తాను." అని అనుకొంటూ వుండగా శిష్యులు ఆయన చుట్టూ మూగి "గురువుగారూ, చీకటిపడేలా వుంది. ఇప్పుడు మనం ఏం చేద్దాం" అని అడిగారు.

పరమానందయ్యగారు ఆలోచనలో పడ్డారు.

## ఏరుకు సంబంధించిన విచిత్ర కథలు

ఆ యేరు గురించి శిష్యులు అనేక రకాల కథలు చెప్పుకోనసాగారు. ఒక శిష్యుడు యిలా చెప్పాడు. "ఒకసారి యేటిలో నీరుకొంచెమయినా లేదు. అప్పుడు కొందరు పెండ్లివారు యేటిలో నడిచి అవలివైపుకు పోతున్నారు. సగం దూరంపోయే సరికి యేరు మహావేగంగా పొంగి పొరులుతూ పెండ్లివారినందరినీ తనతోపాటు లాక్కుపోయింది. అంతా తలొక వైపుకు కొట్టుకొనిపోయారు. ఎక్కడెక్కడో చచ్చి పడి వున్నారు. ఇంత దొంగయేరు ఈ భూ ప్రపంచంలో మరెక్కడాలేదని మా తాత గారు చెప్పారు. పొరుగు పచ్చగా వుంటే చూచి ఓర్వలేని గుణం దీనికి బాగా వుందట. నీరు లేనప్పుడే ఇది యెంత అఘాయిత్యం చేస్తుందో మరి? బాగా ఆలోచించుకొని మరీ వెళ్ళాలి. లేకుంటే నిష్కారణంగా ప్రాణాలు పోగొట్టుకోవలసి వస్తుంది" అని చెప్పాడు.

ఆ మాటలు విని శిష్యులు భయంతో బిగుసుకుపోయారు. గురువుగారి ఆజ్ఞకోసం యెదురు చూస్తున్నారు. గురువుగారు కండ్లు మూసుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

అలా వుండగా మరొక శిష్యుడికి ఆ యేరుకు సంబంధించిన కథ ఒకటి తటాలున జ్ఞాపకానికి వచ్చింది. ఎలాగో ధైర్యం తెచ్చుకొని ఈ విధంగా చెప్పాడు. "దీని కడుపుకాలా ఇది కనబడని దొంగ. మా తాతగారి ఉప్పు వ్యాపారాన్ని నాశనం చేసింది ఈ యేరే! మా తాతగారు ఉప్పువ్యాపారం చేస్తుండేవారు. ఆయన



యేరు నిద్రపోతున్నదో, మెలకువగా ఉన్నదో తెలుసుకొన్న శిష్యుడు

ఉప్పు బస్తాలు బండిలో వుంచుకొని గ్రామ గ్రామానికి వెళ్ళి అమ్ముతుండేవారు. కర్మకాలి ఒకసారి ఉప్పు బస్తాలు బండిలో వేసికొని ఈ యేరు దాటిపోవలసి వచ్చింది. బండి యేరు మధ్యకు వెళ్ళేసరికి అకస్మాత్తుగా ఏరు పొంగి పొర్లివచ్చింది.

ఎద్దులు ఆ ప్రవాహాన్ని తట్టుకొని నిలువలేక బోర్లా పడ్డాయి. బండి తలక్రిందు లయింది. మా తాత పందమంది సహాయంతో బండిని యెత్తి ఎద్దులను కట్టి, ఎంతో శ్రమపడి ఒడ్డునకు చేర్చి చూడగా కట్టిన బస్తాలు కట్టినట్లే వున్నాయి కాని బస్తాలలో ఉప్పుమాత్రం మాయమయింది. ఏరు చేసిన మోసానికి మా తాతగారు లబో దిబోమన్నారు, ఎంతో నష్టపోయారు, ఇంటికిపోయి మంచమెక్కారు. మరి లేవ లేదు. చూడండి ఇది ఎంత దుర్మార్గమైన యేరో!" అని చెప్పాడు.

ఈ కథవిని శిష్యులతోపాటు పరమానందయ్యగారు కూడా భయపడ్డారు. తమ మూటలలోని సరుకుల నెక్కడ మాయం చేస్తుందో అని దిగులుపడ్డారు. బాగా ఆలోచించి శిష్యులను మూటలు క్రిందపెట్టి కూర్చోమని ఆజ్ఞాపించారు. ఒక శిష్యుణ్ని పిలిచి యేరు నిద్రపోతున్నదో, మెలకువగా ఉన్నదో చూసి రమ్మని ఆజ్ఞాపించారు.

గురువుగారి ఆజ్ఞననుసరించి ఆ శిష్యుడు వేగంగా యేటి ఒడ్డుకువెళ్ళి నిలబడి చూచాడు. యెంతసేపు చూచినా యేరు నిద్రపోతున్నదో, మెలకువగా వున్నదో కనిపెట్టలేకపోయాడు. తుదకు ఒక ఉపాయం ఆలోచించాడు. ప్రాంతంలో గల చాకిరేవు వద్ద మండుతున్న ఒక పొయ్యి కనబడింది. గబగబా పరుగెత్తి వెళ్ళి మండుతున్న ఒక కట్టెను తీసుకొన్నాడు. ఆ కట్టెను జాగ్రత్తగా పట్టుకొని ఏటి వద్దకు వెళ్ళాడు. అడుగులో అడుగు వేసుకొంటూ అతి నెమ్మదిగా వణకుతున్న చేతిలోగల కట్టెను నీటిలో ముంచాడు. ఇంకేముంది? నీరు తగలగానే కట్టె "సుయ్యి"మని శబ్దంచేస్తూ ఆరిపోయింది. అది గమనించి శిష్యుడు హడలి బెజారై పోయాడు. ఏరు మెలకువగానే వుందని గ్రహించాడు. పరుగు పరుగున గురువుగారి వద్దకు వెళ్ళి "గురువుగారూ! ఏరు మెలకువగానే వుంది." అని చెప్పాడు, "నువ్వా విషయం యెలా తెలుసుకున్నావురా!" అని పరమానందయ్యగారు అడిగారు.

శిష్యుడు చేసిన ప్రయత్నమంతా వివరించి చెప్పాడు. "నేను దానికి నిప్పు అంటించానని ఏరు పగబట్టి నన్నేం చేస్తుందో" అని వెక్కి వెక్కి ఏడ్వ నారంభించాడు. నేనుండగా నీకేం భయంరా? అది నిన్నేమైన చేస్తే శపించి పారేస్తాను. ఇప్పుడే శపించేద్దును కాని ఏరు లేకపోతే ప్రజలకు పశులకు, జంతువులకు, చెట్లకు నీరు లేకుండా పోతుంది. అలా చేయడం మంచిపని కాదు. పైగా పాపం చుట్టుకొంటుంది. ఈ తలంపుతోనే నేను దీన్ని క్షమించి ఊరుకోవలసి వచ్చింది. మరికొంతసేపు ఓర్చి చూద్దాం. ఓరిస్తే ఓరుగల్లు పట్టణమౌతుందన్నారు పెద్దలు" అని ఓదార్చారు.

కొంతసేపు ఆగి పరమానందయ్యగారు మరియొక శిష్యుణ్ని పిలిచి "ఏరు మెలకువగా వున్నదో నిద్రపోతున్నదో చూచి రమ్మ"ని ఆజ్ఞాపించారు. శిష్యుడు ఏటివద్దకు వెళ్ళడానికి భయపడ్డాడు. ఎంత ధైర్యం చెప్పినా ముందుకు ఒక అడుగు కూడా వెయ్యలేదు. పోనీ, అతనితో ఎవరినయినా సాయం తీసుకొని వెళ్ళమని సూచించారు. ఒక్కడు కూడా సిద్ధపడలేదు. ముందు వెళ్ళినవాడిని సాయం వెళ్ళమన్నారు. అతడు "అయ్యబాబోయ్! అది అసలే నామీద పగబట్టింది. దానిదగ్గరకు వెళ్ళానంటే అమాంతంగా మీదపడి మింగేస్తుంది నేను వెళ్ళనంటే వెళ్ళనని ఖచ్చితంగా చెప్పేశాడు.

గురువుగారు చేసేదిలేక తల గోక్కుంటూ గొప్ప చిక్కువచ్చి పడిందే ఇప్పుడేం చేయాలి అని ఆలోచనలో పడ్డారు. సుందరమ్మగారు "ఎవరూ వెళ్ళి చూడకపోతే తెల్లవార్లూ ఇక్కడేపడి వుండవలసి వస్తుంది. మరి కాస్సేపటిలో చీకటి పడబోతుంది. రాత్రంతా మనం ఇక్కడే ఉండవలసి వస్తుంది. చీకటి పడగానే నక్కలు, అడవిపందులు వగైరాలు వచ్చి మన మీదపడి పీక్కుతింటాయి. దొంగలు వచ్చి మన దగ్గరవున్న ధనధాన్యాలు ఎత్తుకు పోతారు. అంతేగాక అర్ధరాత్రికాగానే దయ్యాలు, భూతాలు వచ్చి మన మీద పడతాయి" అని చెపుతూవుండగా శిష్యులంతా ఒక్కసారి "అయ్యబాబోయ్! దయ్యాలే! మేము యిప్పుడే ఎక్కడికయినా

పారిపోతాం" అని గట్టిగా అరిచారు భయంతో. ఒకరినొకరు కౌగిలించుకొని వెక్కి వెక్కి ఏడ్వనారంభించారు.

అంతట పరమానందయ్యగారు ఎలాగో ధైర్యం తెచ్చుకొని "నేనుండగా మీరు భయపడవలసిన పనిలేదు. ఇప్పుడు ఇంకా సమయం మించిపోలేదు. మరి కొంతసేపటి వరకూ చీకటి పడదు. ఈ లోపుగా మనం ఏరు నిద్రపోతున్నదో, మెలకువగా ఉన్నదో తెల్సుకోవాలి. నిద్రపోతుంటే మనం సునాయాసంగా, చీకటి పడకముందే ఏరుదాటి పోవచ్చును. కనుక ఎవరైనా వెళ్ళిఏరు నిద్రపోతుందో లేదో చూచి రండి" అన్నారు.

## ఏరు నిద్రపోతున్నదని కనిపెట్టిన శిష్యుడు

గురువుగారి భార్య సుందరమ్మగారు "అర్ధరాత్రి కాగానే దయ్యాలు' భూతాలూ వచ్చి మన మీద పడతాయి" అన్న మాటలు విని శిష్యులు తెగించి ఒక నిశ్చయానికి వచ్చారు, దెయ్యాలవల్ల గాని భూతాలవల్లగాని చంపబడేకంటే ఏరు వల్ల చాపడమే మంచిదను కొన్నారు. మీరంతా నా వెనుక నిలబడితే నేను ఏరు నిద్రపోతున్నదో, మెలకువగా వున్నదో కనిపెట్టి చెపుతానన్నాడు ఒకడు. అతని వెనుక నిలబడటానికి శిష్యులు ఏకగ్రీవంగా అంగీకరించారు. "ఆలస్యాదమృతం విషం" అని పెద్దలు చెప్పారు కనుక వెంటనే అతనిని బయలుదేరమని ప్రోత్స హించారు.

అంతట ఆ శిష్యుడు, అంతకు ముందు నీటిలో పెట్టడం వల్ల చల్లారి పోయిన కట్టెను తీసుకుని అడుగులో అడుగు వేసుకుంటూ చడీచప్పుడు లేకుండా

ఏటివద్దకు వెళ్ళాడు. తక్కినవారు అతని ననుసరించి వెళ్ళారు. అప్పుడు ఆ కట్టె పట్టుకొన్నవాడు ఎంతో ధైర్యంచేసి, నలుమూలలా చూచి తనచేతిలో వున్న కట్టెను చిచ్చుబుద్దికి నిప్పు ముట్టించే వాడిలా ఏటిలోని నీటికి తగిలించాడు సుయ్ సుయ్యి మనే శబ్దాలు ఏమీరాలేదు. అది గమనించి అతడు ఏరు నిద్రపోతున్నదని కనిపెట్టి హనుమంతుడు లంకలో సీతను చూచి సంతోషించిన దానికి రెట్టింపుగా సంతో షించాడు. సహచరులతో పరుగు పరుగున గురువుగారి వద్దకుపోయి ఏరు నిద్ర పోతున్నదని చెప్పాడు.

ఆ మాట విని పరమానందయ్యగారు బ్రహ్మానంద భరితులయ్యారు శిష్యులను, మూటలను తీసుకుని బయలుదేరమన్నారు. శిష్యులంతా మూటలు తల పెట్టుకొని ఏటి వరకు వెళ్ళి ఆగిపోయారు. సతీసమేతంగా వారు వెనుక వస్తున్న పరమానందయ్యగారు "నడవండిరా! మళ్ళీ ఆగిపోయారేం!" అని హెచ్చరించారు "ఏటిలో అడుగుపెట్టడానికి భయంగా వుంది గురువుగారూ! మీరుముందు నడవండి మేము మీ వెంట వస్తాము" అన్నారు శిష్యులు ఏక కంఠంతో. శిష్యులముందు వెనుకాడితే లాభం లేదనుకున్నారు పరమానందయ్యగారు. భార్యవంక చూచారు. మనకు తప్పదు. పదండి సుందరమ్మగారు సైగ చేశారు.

అంతట పరమానందయ్యగారు ముక్కోటి దేవతలను మనసులో తలచు కొని, ఆంజనేయదండకం చదువుతూ శిష్యుల్ని కూడా చదవమని ఆజ్ఞాపించి, ప్రాణాలకు తెగించి యేటిలో అడుగుపెట్టి నెమ్మదిగా నడవసాగారు. గురువుగారికి ఏవిధమైన బాధ కలుగలేదని గ్రహించిన శిష్యులు ధైర్యంగా దారివెనుక నడచి

పోసాగారు. ప్రాణములు బిగపట్టుకొని ఐదు నిమిషాలపాటు అతి ప్రయాస పడి నడచి నడచి ఒడ్డుకు చేరుకున్నారు.



పరమానందయ్యగారు శిష్యులతో ఏరుదాటుట

పరమానందయ్యగారు సంధ్య వార్చుకొని వస్తామని శిష్యులకు చెప్పి గట్టుమీద కూర్చోండని ఆజ్ఞాపించి సతీసమేతంగా కొంతదూరం వెళ్ళారు. శిష్యులు గట్టుమీద కూర్చుని గండంగడిచి గట్టెక్కామని సంతోషిస్తున్నారు.

## సందేహంలో పడిన శిష్యులు

అప్పుడొక శిష్యునకు సందేహం కలిగింది. అందరూ ఏరు దాటి వచ్చామా లేదా అని అచ్చట వున్నవారందరినీ లెక్కపెట్టాడు. పదకొండుమంది ఉన్నట్టు తేలింది. అరే మేం మొత్తం పన్నెండుమందిమి కదా! మరొకడు ఏమయి నట్లు? అనుకొన్నాడు. మళ్ళీ మళ్ళీ లెక్కపెట్టాడు. పదకొండుమందే లెక్కకు వచ్చారు గభాలున పైకిలేచి "మనలో ఒకణ్ని ఏరు మింగేసింది" అని అరిచాడు. కావలిస్తే లెక్కపెట్టుకొని చూడమన్నాడు.

అతని మాటలు విని అందరూభయంతో వణికిపోసాగారు. ఒక్కొక్కడు లెక్కపెట్టిచూడనారంభించాడు. దాంతో వారికి దుఃఖం పొంగివచ్చింది. "గురువు గారూ! మాలో ఒకణ్ని ఏరు మింగేసింది" అని బిగ్గరగా ఏడవ నారంభించారు. ఆ యేడ్పులు విని పరమానందులవారు సగంలోనే సంధ్యావందనం ముగించి సతీ సమేతంగా వారివద్దకు వెళ్ళి "నాయనలారా! ఏడవకండి! ఏం జరిగిందో చెప్పండి!" అని అడిగారు.

శిష్యులు ఎంతో కష్టము మీద ఏడుపుమాని "గురువుగారూ! ఆ పాపిష్టి ఏరు మాలో ఒకణ్ని తన పొట్టన పెట్టుకొంది" అని చెప్పారు. "ఎవరిని పొట్టన పెట్టుకొంది నాయనలారా?" అని అడిగారు విచారంతో పరమానందులవారు. శిష్యులు "అదే తెలియడం లేదు గురువుగారూ!" అని సమాధానము యిచ్చారు. "తెలియకుండా మీలో ఒకణ్ని ఏరు మింగేసిందని యెలాచెపుతున్నార్రా?" అని ప్రశ్నించారు పరమానందులు తిరిగి.

అప్పుడొక శిష్యుడు గురువుగారి దగ్గరకు వెళ్ళి "మీ శిష్యులమైనమేము మొత్తం పన్నెండుమందిమి కదా! ఇప్పుడు లెక్కపెడితే పదకొండు మందిమే వున్నాం. మీతోపాటు పదమూడుమంది వుండవలసినవాళ్ళం యిప్పుడు పన్నెండు మందిమే వున్నాం. కావాలంటే మీరు కూడా లెక్కపెట్టి చూడండి" అని విన్న వించుకున్నారు! శిష్యుల మాటల్లో కొంతైనా నిజం వుంటుందనుకొన్నారు పరమా

నందులు. అందర్నీ తమ ప్రక్కనే నిలబెట్టి తమను లెక్కపెట్టుకోకుండా మిగిలిన వారిని లెక్కపెట్టి "అరే పండ్రెండుమందిమే వున్నామే మరొకడు ఏమైనాడు" అన్నారు. "అదే తెలియక మేం ఏడుస్తున్నాం గురువుగారూ" అన్నారు శిష్యులు గురువుగారు "ఎవడు ఏటి పాలయ్యాడు చెప్మా" అని ఆలోచించనారంభించారు. శిష్యులు మరింత బిగ్గరగా ఏడ్వనారంభించారు.

అప్పుడే అక్కడికి వచ్చిన సుందరమ్మగారు వారి ఏడ్పులకు కారణం తెలుసుకొని చాలా బాధపడ్డారు. ఎందుకైనా మంచిదని అక్కడ వున్న గురుశిష్యులందర్నీ లెక్కపెట్టి పదమూడు మంది సరిగానే వున్నారే! ఇంతా ఈ ఏడుపు ఎందుకు" అని అడిగారు. గురుపత్ని మాటలువిని శిష్యులు మళ్ళీ లెక్కపెట్టారు.

గురువుగారు కూడా లెక్క పెట్టారు. పండ్రెండు మాత్రమే వున్నట్లు లెక్కకట్టారు. వారు మొదటినుండి ఒక పొరపాటు చేస్తూ వచ్చారు. లెక్కపెట్టినప్పుడు తమను తప్ప మిగిలినవారిని లెక్కపెట్టడంవల్ల వారిలో ఒకరు తగ్గినట్లు తలచి యేడువనారంభించారు. గురుపత్ని చెప్పిన మాటను వారు నమ్మలేకపోయారు. గురువు అభిప్రాయం శిష్యుల అభిప్రాయం ఒకటైంది.

అంతట సుందరమ్మగారు వారినందరినీ వరసగా నిలబడమన్నారు. గురువుగారు ఒకటి అన్నారు ఆయన తరువాత నిలబడినవాడు రెండు ఆ తర్వాతవాడు మూడు అన్నాడు, అలా చెపుతూపోయే సరికి ఆఖరివాడు పదమూడు అన్నాడు. అరే, పదముగ్గురం సరిగానే వున్నామే. అనవసరంగా భయపడి ఏడ్చాం గదా! అనుకొన్నారు. ఆ కుర్రకుంకలు తప్పు లెక్కపెడితే మీరు కూడా అలాగే లెక్కపెడతారా? ఎవరైనా వింటే మీ పరువు యేముంటుందండీ!" అని మందలించారు సుందరమ్మగారు పరమానందయ్యగారిని. "ఈ కుర్ర వెధవల ఏడ్పులతో నా మతి చలించింది. లక్షలమీద లెక్కలు చేసేవాడిని ఈ పాటి లెక్క చేయలేనా?" అని బుకాయించారు పరమానందయ్యగారు. సతీపతులు ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు వారిని చూచి శిష్యులు సిగ్గుపడి తలలు వంచుకొన్నారు.

మొత్తం మీద అందరూ బ్రతికి వున్నామని దృఢ పరచుకొని తిరిగి ప్రయాణం సాగించారు. చచ్చిచెడి రాత్రి పదిగంటలకు స్వస్థలమగు పరమానంద పురం చేరారు.

## గురువుగారి కాళ్ళు నరుకుటకు సిద్ధపడిన శిష్యులు

మరునాడు పరమానందయ్యగారు వొడలు నొప్పులతో బాధపడసాగారు. ప్రయాణం వల్ల వారు బాగా అలసిపోయారు. కాళ్ళు, నడుము, శరీరం అంతా నొప్పులమయమైంది. సుందరమ్మగారి పరిస్థితి కూడా అలాగేవుంది. కావున ఆమె భర్త పాదములు వొత్తే స్థితిలో లేదు. అందువల్ల పరమానందయ్యగారు శిష్యులను పిలిచి నడక వల్ల తమ శరీరమంతా నొప్పులు కలిగాయని చెప్పి వొళ్ళు పట్టమని ఆజ్ఞాపించారు. గురువుగారు అడగటం తడవుగా శిష్యులు వంతులు వేసుకొని ఒకొక్కరు అవయవం పట్టనారంభించారు. అలా శిష్యులు చేస్తుంటే గురువుగారికి సుఖనిద్ర పట్టింది.

అలా జరుగుతుండగా కాళ్ళుపట్టే వారి మధ్య తగవు పుట్టింది. "నా కాలు మంచి" దని వాదించుకోసాగారు. వాదన క్రమంగా ముదిరింది. "నీ కాలు మంచిది కాదంటే నీ కాలు మంచిదికా" దని తగవు పడసాగారు. చిలికి చిలికి గాలివానగా మారినట్టు నీ కాలు నరికేస్తానంటే నీ కాలు నరికేస్తానని రెండు కత్తులు తెచ్చి గురువుగారి కాళ్ళు నరికివేయటానికి సిద్ధపడ్డారు. వారి కేకలవల్ల పరమానందయ్య గారి నిద్ర పాడైంది. శిష్యులు తన కాళ్ళు నరకటానికి సిద్ధపడుతున్నారని గ్రహించి

"ఓరి! వెధవల్లార-మీరూ మీరూ తగవు పడి నా కాళ్ళు నరుకుతారట్రా! మీకేం పోయేకాల మొచ్చిందిరా" అని పైకిలేవబోయారు.

అప్పుడు మిగిలిన అవయవములు పట్టుచున్న శిష్యులు ఆయనను పైకి లేవనీయకుండా గట్టిగా నొక్కిపట్టి "గురువుగారు! ఈ వెధవలెప్పుడూ ఇలాగే



గురువుగారి కాళ్ళు నరకబోతున్న శిష్యులు

తగాదాపడుతూ ఉంటారు. వాళ్ళ గొడవ మీరు పట్టించుకోకండి! వాళ్ళ కాళ్ళను వాళ్ళేంచేసుకుంటే మీకెందుకు? మీరా విషయం పట్టించుకోకండి!" అని సర్ది

చెప్పసాగారు. ఈ లోపుగా కాళ్ళు పడుతున్న వాళ్ళు కత్తులు పైకెత్తి గురువుగారి కాళ్ళు నరుకుటకు సిద్ధపడ్డారు. వారి వాలకం చూచి గురువుగారి గుండె గుభేలు మంది. "సుందరీ! ఒక్కసారి ఇలారా!" అని బిగ్గరగా భార్యను పిలిచాడు. పొలికేక విని సుందరమ్మగారు త్రుళ్ళిపడి లేచి గబగబ పరమానందయ్యగారి వద్దకు వచ్చి జరిగిన సంగతి తెలుసుకుని ఉగ్ర నరసింహావతారం దాల్చింది. అక్కడే వున్న దుడ్డుకర్ర తీసుకుని వారినందరినీ కుక్కలను బాదినట్టు బాది యింట్లో నుంచి తరిమి వేసింది. ఆ రోజంతా తిండి పెట్టకుండా మాడ్చింది. మరునాడు తిండిలేక బాధపడు తున్న శిష్యులను చూచి పరమానందయ్యగారు జాలిపడి, భార్యకు నచ్చచెప్పి తిండి పెట్టించాడు.



## తాటిమానుకు సూదిని గుచ్చి తెచ్చిన శిష్యులు



శిష్యులకు పరమానందయ్యగారి పట్ల తగిన అభిమానం, భక్తి ఉన్నాయి. వారాయనను పరబ్రహ్మ స్వరూపుడని భావిస్తారు. గురువుగారు ఎంత కష్టమైన పని చెప్పినా వెనుకాడక చేయడానికి సిద్ధపడతారు. ఏ పని చెప్పినా పండ్రెండుగురూ పరుగెత్తుతారు.

ఒకసారి గురువుగారి కాలిలో ముల్లు గుచ్చుకొన్నది. ముల్లు తీయడానికి సూది కావలసి వచ్చింది. ఇంట్లో సూది లేనందున శిష్యులను చూచి ఎవరినయినా అడిగి సూది సంపాదించి తెమ్మన్నాడు. అనడం తడవుగా అంతా బయలుదేరారు. ఇంటింటికి వెళ్ళి సూది వుంటే యిమ్మని అడిగారు. ఒక్క సూది కోసం ఇంతమంది వచ్చి అడగడం గృహస్థులకు చిరాకు కలిగించింది. లేదు పొమ్మన్నారు. ఎక్కడికి వెళ్ళి అడిగినా అదే జవాబు వచ్చింది. తుదకు పరమానందయ్యగారంటే మిక్కిలి గౌరవం, భక్తి గల ఒక రైతు భార్యకు నచ్చచెప్పి సూది తీసుకొని యింటి బయటకు

వచ్చాడు. అతని చేతిలోవున్న సూదిని చూచి శిష్యులు "నాకు యిమ్మంటే నాకు యిమ్మ"ని ఆయనపై ఎగబడ్డారు. రైతుకు వారి గోల చూసేసరికి మతిపోయింది. "నలుసంత సూదిని తీసుకొనిపోవడానికి ఇంతమందా" అని ఆశ్చర్యపడ్డారు. వీరు మహా అమాయకులు అనుకుని జాలిపడ్డారు. "అబ్బాయిలూ! ఒక్క సూది కోసం ఇంతమంది రావాలా? ఒక్కరువస్తే చాలదా? ఎవరో ఒకరు వచ్చి సూది తీసుకు వెళ్ళండి!"

రైతు మాటలు విని శిష్యులు యిలా అన్నారు! "అయ్యా! మా గురువు గారు ఏపని చెప్పినా మేమంతా కలిసి చేస్తాం, మాలోమాకు ఏ భేదంలేదు. దయ వుంచి సూదియిస్తే అంతా కలిసి పట్టుకుని తీసుకుపోయి గురువుగారికి యిస్తాం" అన్నారు. రైతు వారి మాటలువిని లోలోపల నవ్వుకొని "అంగుళంన్నర పొడ వైనాలేని సూదిని యింతమంచి ఎలా పట్టుకుపోతారయ్యా! నేనొక ఉపాయం చెపు తాను. అలా చేయండి. మా దొడ్లో ఒక తాటి మ్రాను పడివుంది. దాని తల భాగ మున ఈ సూదిని గ్రుచ్చి తీసుకొని వెళ్ళండి" అని వేళాకోళంగా చెప్పాడు. "మీరు చెప్పింది చాల బాగుంది. అలాగే చేస్తాం. తాటిమ్రాను చూపించండి" అన్నారు. రైతు వారి మాటలు విని లోలోపల నవ్వుకొని, దొడ్డిలోనికి తీసుకొని వెళ్ళి క్రింద పడివున్న తాటిచెట్టును చూపించాడు. దానిని చూచి శిష్యులు ఎంతో ఆనందించి, సూదిని దానికి గ్రుచ్చి దాన్నినెత్తి మోస్తూ గురువుగారి వద్దకు బయలుదేరారు. ఊళ్ళోవారు వారిని చూచి తలకొక విధంగా చెప్పుకొని నవ్వుకొన్నారు. ఎవరు ఎలా నవ్వుకొన్నా వారు లక్ష్యపెట్టే వారు కారు! వారికి కావలసిందల్లా గురువుగారి ఆజ్ఞ పాటించామా లేదా అనే!

శిష్యులు తాటిమ్రానుకు సూదిని గ్రుచ్చి తేవడంచూచి పరమానందయ్య గారు తెల్లబోయారు. వార్ని గట్టిగా మందలించారు. సూదితో ముల్లు తీసుకొని వెంటనే దానిని ఇచ్చినవారికి అప్పగించి రమ్మన్నారు. శిష్యులు ఆ సూదిని మళ్ళి త్రాటి మునుకు గ్రుచ్చి దానిని మోసుకొనివెళ్ళి రైతుకు యిచ్చివచ్చారు. పరమా

నందయ్యగారి శిష్యుల చర్యలు చూచి రైతు దంపతులు కడుపు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

## గురువుగారికి అశ్వవాహనం

రాను రాను పరమానందయ్య గారికి పొరుగూళ్ళనుండి ఆహ్వానములు ఎక్కువగా రాసాగాయి. తమను తమ శిష్య బృందాన్ని చూడాలని తహ తహ పడుతున్నాం. దయయుంచి వీలు చూసుకుని ఒకసారి వచ్చి వెళ్ళగోరుతున్నాం. అని ఇతర గ్రామస్తులు అర్థించనారంభించారు. అట్టి ఆహ్వాన పత్రికలు చూచి శిష్యులు ఆనందం పట్టలేక పోయారు. ఇంత గొప్ప గురువుగారు నడచి వెళ్ళడం బాగుండదు. గురువుగారికిగజ వాహనం లేకపోయినా, కనీసం అశ్వవాహనమైనా వుంటే బాగుంటుంది. ఎంత కష్టపడి అయినా గురువుగారికి ఒకగుర్రం సంపాదించాలని శిష్యులు ఏకగ్రీవంగా అభిప్రాయబడ్డారు. వెంటనే పరమానందుల వారిదగ్గరకు వెళ్ళి తమ అభిప్రాయం చెప్పారు. ఆయన మనసులో ఆనందించి, పైకి యిలా అన్నారు. "ఆలోచనైతే బాగానేవుంది కాని గుర్రం కొనడానికి తగినంత డబ్బు మనకెక్కడిది? గుర్రం ఎక్కనంతమాత్రాన మన గౌరవం, ప్రతిష్ట పోతాయా? మనం నిరాడంబరంగా ఉంటేనే బాగుంటుంది."

గురువుగారి మాటలు విని శిష్యులు యిలా అన్నారు. "గురువుగారూ! మీ గొప్పతనం మీకు తెలియడం లేదు. మీరెంత గొప్పవారో మాకు తెలుసు. డబ్బు లేక పోయినా మేము ఎలాగో తంటాలుపడి గుర్రాన్ని సంపాదిస్తాం. మీరు ఇప్పటినుంచి ఎక్కడకు వెళ్ళినా అశ్వ వాహనంమీద వెళ్ళాలి. అప్పుడు మీకీర్తి ప్రతిష్ఠలు మరింత ప్రకాశిస్తాయి. మామాట కాదనక మీరు గుర్రం ఎక్కడానికి అంగీకరించండి" అని బ్రతిమాలారు. శిష్యులు ఆ విధంగా బ్రతిమాలుతూ వుంటే పరమానందయ్యగారు

కాదనలేకపోయారు, "మీకు ఎలా ఇష్టమైతే అలాగే చేద్దాం" అని అంగీకరించారు. గురువుగారు గుర్రమెక్కడానికి అంగీకరించినందుకు శిష్యులు ఎంతో ఆనందించారు.గురువుగారి పాదాలను నమస్కరించి గుర్రం సంపాదించడానికి బయలు దేరారు.

## గుర్రం గ్రుడ్డు కథ

శిష్యులంతా ఊరి బయటకు పోయారు. ఎక్కడా ఒక గుర్రం కూడా కనపడలేదు. మరికొంత దూరం వెళ్ళారు. అచ్చట ఒక తోట దగ్గర చెరువు ఒకటి కనబడింది. ఆ చెరువు సమీపంలో కొన్ని గుర్రాలు మేస్తున్నాయి. ఆ ప్రాంతంలో ఎవరో బూడిద గుమ్మడికాయల పాదులు వేశారు. ఆ పాదులు అనేక కాయలు కాశాయి. ఆ కాయలేమిటో శిష్యులకు తెలియదు. "ఏం కాయలివి? ఏం కాయలివి?" అని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు. "నాకు తెలియదంటే నాకు తెలియ"దని అంతా అన్నారు.

ఇంతలో ఒక గ్రామస్థుడు ఆ మార్గమున పోతూ వారికి కనబడ్డాయి. వారు పరుగున ఆ వ్యక్తి వద్దకు వెళ్ళి "ఏమయ్యా! ఈ కాయలేం కాయలు?" అని అడిగారు గ్రామస్తుడు వారిని ఏడిపించాలనుకొని "గుర్రం గుడ్లు" అని చెప్పి తన మార్గమున వెళ్ళిపోయాడు.

గుర్రం గుడ్లు అనేమాట వినేసరికి వారికి కొండంత సంతోషం కలిగింది, అక్కడే మేస్తున్న గుర్రాలే ఆ గుడ్లను పెట్టి వుంటాయని నిశ్చయించుకొన్నారు. వారు ఆ విధంగా నిశ్చయించుకొని గుర్రాన్ని కొనేబదులు గుర్రం గుడ్డు కొంటే ఖర్చు తక్కువవుతుందని తీర్మానించుకున్నారు. గుర్రాన్ని కొనాలంటే కనీసం రెండువందల రూపాయలయినా కావాలి. గుడ్డు కొనడానికయితే అంత సొమ్ము

అవసరం లేదు. చౌకగా గుర్రాన్ని సంపాదించవచ్చు అనే ఆలోచనలో వారు పొలాల వద్ద కాపలా కాయుచున్న పిల్లవాని వద్దకు వెళ్ళి "ఓరీ! యీ గుర్రం గుడ్డు ఖరీదెంత? మాకొక గ్రుడ్డు కావాలి?" అని అడిగారు.

శిష్యుల మాటలు విని పిల్లవాడు తనలో తాను నవ్వుకొని "యీ గుడ్డును తీసుకుపోయి యేం చేస్తారయ్యా?" అని అడిగాడు. అప్పుడు వారు "ఏం చేస్తామా? పొదుగుతాం! పొదిగి పిల్లలను పుట్టిస్తాం!" అన్నారు. వారి మాటలు విని ఆ కొంటె పిల్లవాడు మనసులో "పిచ్చి పట్టి తెలివి తక్కువ దద్దమ్మలు" అనుకొని, "మీరు యెలా పొదుగుతారు?" అని ప్రశ్నించాడు. అతని ప్రశ్న విని వారు "ఈ గ్రుడ్డు నొక మూలపెట్టి రోజుకొకరం దానిమీద కూర్చుంటాం. వారం పదిరోజులు అలా చేస్తే పిల్ల పుడుతుంది." అని చెప్పారు. పిల్లవాడు పొంగివచ్చే నవ్వును బలవంతంగా ఆపుకుని "ఔనౌను. అలాగే చేయండి" అన్నాడు. "ఇంతకూ దీనిని మాకు యెంత కమ్ముతావు?" అని అడిగారు శిష్యులు.

ఆ రోజులలో ఒక బూడిదగుమ్మడికాయ ఖరీదు అర్థరూపాయి కంటె తక్కువే ఉండేది అయినా ఆ గడుసుపిల్లవాడు వారి అమాయకత్వాన్ని గ్రహించి "ఇతరులకయితే ముప్పయి రూపాయలకొకటి అమ్ముతున్నాం. మీకు కనుక ఇరవై రూపాయలకు యిస్తానండి, పరమానందయ్యగారి శిష్యులు గదా! మీ దగ్గిర ఎక్కువ తీసుకోమండి" అన్నాడు.

అతని మాటలు విని శిష్యులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. వాడు చౌకగానే యిస్తున్నాడని. గుర్రాన్ని కొనేకంటే గ్రుడ్డుకొని పిల్లను చేస్తే తక్కువ ఖర్చులో గుర్రం వస్తోందని ఏకగ్రీవంగా తీర్మానించుకొని ఇరవై రూపాయలు ఇచ్చి ఒక పెద్ద బూడిద గుమ్మడికాయను తీసుకొని బయలుదేరారు.

ఒక శిష్యుడు ఆ కాయను తలపై పెట్టుకున్నాడు. మిగిలిన శిష్యులు అతని చుట్టు మూగి కాయపై చేయిపెట్టి తీసుకువెళుతున్నారు. వారు అలా కొంతదూరం వెళ్ళేసరికి కాయపట్టుకుని పైకి చూస్తూ నడుస్తున్న శిష్యునికొక బండరాయి తగిలి బోర్లాపడ్డాడు. అందరూ అతనిమీద పడ్డారు. కాయ పగిలి బద్దలైంది. ఆ చప్పుడు విని అచ్చటి పొదలో ఉన్న కుందేలు బెదిరి పరుగెత్తింది. శిష్యులు పైకి లేచి పరుగెత్తిపోతున్న కుందేలును చూచి "అరే, గుడ్డుపగిలి గుర్రంపిల్ల బయటకు వచ్చి చెంగు చెంగున గెంతుకుంటూ పారిపోతున్నది. పట్టుకుందాం. పదండి" అనుకొని పరుగెత్తారు. కుందేలు వాయువేగంకంటే వేగంగా పరుగెత్తిపోయి ఒక చెట్టు తొర్రలో దూరి కూర్చున్నది. వారు ఎంత వెదికినా అది కనబడలేదు.

చేయునదిలేక, నడవడానికి శక్తిలేక ఉసూరుమంటూ వారు తలలు పట్టుకొని ఒకచోట కూర్చుండిపోయారు. గుర్రాన్ని తీసికొనిపోకుండా గురువుగారికి ముఖాలెలా చూపించాలా అని విచారిస్తున్నారు.

అదృష్టవశాత్తూ ఆ దారిన ఒక పెద్దమనిషి గుర్రంపై స్వారీచేస్తూ వెళుతున్నాడు. తలలు పట్టుకొని గుంపులు కూర్చున్న బ్రహ్మచారులను చూచి పాపం! వీరెవరో? ఇక్కడ ఎందుకు విచారంగా కూర్చున్నారో అని జాలిపడి వారి దగ్గరకు వెళ్ళబోతున్నాడు.

గుర్రంమీద ప్రయాణం చేస్తున్న పెద్ద మనిషిని చూచి, ఆయన ముందుకు పోయి "అయ్యా మా గురువుగారయిన పరమానందయ్యగారికి ఒక గుర్రంకావాలి. మీ దగ్గర మరియొక గుర్రం ఉంటే మాకు యిప్పించండి. మీకు పుణ్యముంటుంది కావాలంటే తృణమో ఫణమో యిచ్చుకుంటాను. ఉదయం నుంచీ గుర్రం కోసం తిరుగుతున్నాం. గుర్రం దొరకలేదు కాని గ్రుడ్డుదొరికింది. దానిని తలపై దూపాయ లిచ్చి తెస్తుండగా రాయితగిలి క్రిందపడ్డాం. అప్పుడు గ్రుడ్డుపగిలి దానిలో ఉన్న

పిల్ల మమ్మల్ని తప్పించుకొని పోయింది. వట్టి చేతులతో గురువుగారికి ముఖాలు చూపించలేక యిక్కడే కూర్చుండిపోయాం. ఇంతలో అదృష్టవశాత్తు మీరు కనిపించారు" అని చెప్పాడు.



కుందేలు వెంట పరిగెడుతున్న శిష్యులు

పెద్దమనిషికి వారి మాటలు సరిగా అర్థం కాలేదు. అన్నీ వివరంగా తెలుసుకున్నాడు. లోలోపల నవ్వుకున్నాడు. వీరు పరమ మూర్ఖులు అనుకొని జాలిపడి "అయితే మీరు యిప్పుడు ఏమి చేయదలుచుకున్నారు సాయంత్రం కావస్తుంది?

కూడాను" అని అడిగాడు. "గుర్రం దొరికేవరకూ అన్నహారములు మాని యిక్కడే ఉండిపోవాలను కుంటున్నాం" అన్నారు పరమానంద శిష్యులు.

"చీకటి పడిందంటే యిక్కడ ఉండటం మంచిదికాదు. ఈ ప్రాంతములో చిరుతపులులు వగైరా దుష్ట మృగాలు తిరుగుతూ వుంటాయి. అవి మనుష్యుల్ని చంపి తినేస్తాయి. కనుక మీరు ఎక్కడికయినా వెళ్ళి ఉండండి కాని ఇక్కడ మాత్రం ఉండకండి" అన్నాడు పెద్దమనిషి.

"గురువుగారికి గుర్రం సంపాదించి యివ్వలేని మా బ్రతుకు లెందుకు? ఇక్కడేఉండి దుష్టమృగములవాతబడి చస్తాం" అన్నారు పరమానందయ్యశిష్యులు.

వారి మాటలు విని ఆ పెద్దమనిషి జాలిపడ్డాడు. వారిరిగల గురుభక్తికి సంతోషించి యిలా అన్నాడు. "అబ్బాయిలు మీకు గుర్రం కావాలంటే మాటలతో దొరకదు. రెండు మూడు వందల రూపాయలు ఖర్చు చేయవలసి వస్తుంది. అంత ధనం మీరు తేగలరా?" అని అడిగాడు. శిష్యులు అంత ధనం మావద్ద లేదు! ఉన్న ఇరవై రూపాయలు యిచ్చి గుర్రం గుడ్డు కొంటే అది అలా మోసం చేసి పారి పోయింది.

వారి మాటలు విన్న పెద్దమనిషికి నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు కాని వారికేదో విధంగా సహాయపడాలని నిశ్చయించుకొని "నేను ఒక సంగతి చెప్తాను శ్రద్ధగా వినండి. నా వద్ద ఒక గుర్రం వుంది. అది ముసలిదయి పోయింది దానికొక కాలు కుంటిది. ఒక కన్ను సరిగా కనపడదు. కావాలంటే ఆ గుర్రాన్ని మీకు యిస్తాను" అన్నాడు.

ఆ మాటలు విన్న పరమానంద శిష్యులు "అది కుంటిదైతేనేం, గ్రుడ్డిదైతేనేం గుర్రమే కదా! గురువుగారికి ఎలాగో నచ్చచెప్పి, అంతా కలిసి

"ఎలాగో నడిపించుకొంటాం" అన్నారు. మళ్ళీ సందేహంలో పడ్డారు. ఆ గుర్రానికి ఆయన ఎన్ని రూపాయలు ఇమ్మంటాడో. ఇరవై ముప్పై అయితే ఎలాగో ఇవ్వ వచ్చు. ఎక్కువడిగితే ఏం చేయాలి అని విచారంలో మునిగిపోయారు.



గురువుగారి యింటికి గుర్రాన్ని తీసుకొని వచ్చిన శిష్యులు

పెద్దమనిషి వారి వైఖరి చూచి జాలిపడి "అబ్బాయిలూ! మీరు నాకు ఒక్క పైసా కూడా యివ్వనవసరం లేదు. గుర్రాన్ని మీకు ఉచితంగానే యిస్తాను నా

కూడా రండి" అన్నాడు. ఆ మాటలు విని వారు బ్రహ్మానంద భరితులయ్యారు. పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లు భావించి, లేని శక్తి తెచ్చుకొని ఆయన వెంట పడ్డారు. రెండుమైళ్ళ దూరం ఎలాగో కష్టపడి గుర్రం వెంట పరుగెత్తి వెళ్ళారు. పెద్దమనిషి చెప్పిన ప్రకారం గుర్రాన్ని వారికి యిచ్చి యెలా తీసుకుపోవాలో, దానికి ఏమేమి పెట్టాలో వివరించి చెప్పాడు.

గుర్రాన్ని చూచి వారు పరమానందమందారు. ఎంతో కష్టపడి దాన్ని గురువుగారి యింటికి చేర్చారు. గురువుగారు గుర్రాన్ని చీకటిలో చూచి ఎంతో ఆనందించారు. శిష్యులు దాని గురించి ఎంత కష్టపడ్డారో తెలుసుకొని జాలిపడ్డారు కాని గుర్రానికి ఒక కాలు కుంటిదని, ఒక కన్ను పోయిందనీ విని అటువంటి గుర్రంపై ప్రయాణం ఎలా జరుగుతుందో అని దిగులుపడ్డారు.

## శిష్యుల కోరికపై పరమానందయ్య గుర్రమెక్కి బయలుదేరుట

కొంత రోజులు గడిచిన తరువాత పరమానందయ్యగారు శిష్య సమేతంగా దూర ప్రాంతంలో ఉన్న ఒక గ్రామం వెళ్ళడానికి నిశ్చయించుకొన్నారు వార శూలలు, వర్జ్యం వగైరాలు ఏమీలేకుండా చూచి ముహూర్తం పెట్టుకొని ఇంటినుండి బయటకు వచ్చారు. ఇంటిముందు శిష్యులు చక్కగా అలంకరించిన గుర్రం సిద్ధంగా ఉంది. పరమానందయ్యగారు శిష్యుల సహాయంతో గుర్రం ఎక్కారు గుర్రంపై ఠీవిగా కూర్చున్న భర్తను చూచి భద్రంగా ఉండమని చెప్పగా పరమానందయ్యా గారు గుర్రాన్ని నడపమని శిష్యులను ఆజ్ఞాపించారు.

అంతట ఒక శిష్యుడు గుర్రానికి ముందు నిలబడి కళ్ళెం పట్టుకుని లాగ నారంభించాడు. ఇంకొకడు తోకపట్టి నులుమనారంభించాడు. మరొకడు గుర్రం పక్క నడుస్తూ గడ్డి తినిపిస్తున్నాడు. కొందరు శిష్యులు గుర్రానికి ఇటూ అటూ ఉండి గురువుగారు పడిపోకుండా చూస్తున్నారు.

ఈ విధంగా కొంతదూరం ప్రయాణంసాగింది. ఒకచోట చిన్నకాలువ అడ్డం వచ్చింది. దాన్ని దాటబోయి గుర్రం కాలువలో పడిపోయింది. శిష్యుల మీద గురువుగారు పడ్డారు. ఆయనను తమ మీదనుండి ప్రక్కకు జరుపుకొనేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది. కొందరు శిష్యులు కాళ్ళు కొట్టుకుని పోయాయి. గురువు గారి నడుము బెణికింది. శిష్యుల తోడ్పాటుతో ఆయన అతికష్టంమీద పైకి లేవగలి గారు. "చచ్చినంత పనైందర్రా!" అని నడుము పట్టుకుని కాలువ గట్టుపై కూర్చు న్నారు. "గురువుగారు! ఇలా జరుగుతుందని మేం కలలో కూడా అనుకోలేదండి. మన గుర్రం గుడ్డిదే అనుకోండి. కుంటిదే అనుకోండి ఇంతచిన్న కాలువ దాటలేక పోతుందా అనుకున్నాం. ఇది ఇలా చేస్తుందనుకుంటే గుర్రంతో సహా మిమ్మల్ని పైకెత్తి కాలువ దాటించి ఉండేవాళ్ళం. పొరపాటైపోయింది క్షమించండి" అని దీనంగా వేడుకొన్నారు. గురువుగారు జాలిపడి "లేచిన వేళా విశేషమర్రా! మీ తప్పేంలేదు! విచారించకండి!" అని శిష్యులను ఓదార్చారు.

పరమానందయ్యగారు నడుమునొప్పితో బాధపడుతూ, ప్రయాణం సాగి ద్దామా, వెనుకకు వెళ్ళిపోదామా అని ఆలోచిస్తూ ఉండగా శిష్యులు గుర్రాన్ని తీసుకువచ్చి ఆయన ముందు నిలబెట్టి "గురువుగారు! ఈసారి జాగ్రత్తగా గమనిస్తూ గుర్రాన్ని నడిపిస్తాం. మీరు భయపడకండి." అని చెప్పారు. శిష్యుల మాటలు

గురువుగారికి కొండంత ధైర్యాన్నిచ్చాయి. "సరే మీ మాట ప్రకారమే కానియ్యండి!" అని శిష్యుల చేయూతతో గుర్రాన్ని అధిష్ఠించారు.

శిష్యులు ఎంతో జాగ్రత్తగా గుర్రాన్ని నడిపిస్తున్నారు. అసలే ఆ గుర్రం ముసలిది. పైగా కుంటిది. అటుపైన గుడ్డిది. గంటకు ఫర్లాంగు దూరం అవలీలగా ప్రయాణం సాగిస్తున్నది.



గుర్రంమీద కూర్చుని వెళుతున్న పరమానందయ్య

గురువుగారి గమ్యస్థానాన్ని ఎంత త్వరగా చేరతామా అని తహ

తహ పడుతున్నారు. గుర్రం అప్పుడప్పుడు ముందుకు మాత్రమే గాక వెనుకకు కూడ నడుస్తున్నది. ఒక్కొక్కప్పుడు కొట్టినా ముందుకు పోకుండా నిలిచిపోయి గుండ్రంగా తిరుగుతున్నది. శిష్యులు ఎంతో కష్టపడి దాన్ని ముందుకు నడిపిస్తున్నారు. అదలిస్తున్నారు, బెదరిస్తున్నారు కాని అది తనంతట తాను ఒక్కసారి కూడా పరుగెత్తడానికి... కాదు...నడవడానికి ప్రయత్నించలేదు. శిష్యులే దాన్ని గురువుగారిని పట్టుదలగా ముందుకు నడిపిస్తూ వెళుతున్నారు. గుర్రాన్ని చిత్రవధ చేస్తున్నారు. వారి ఆగడాన్ని సహించలేకపోయింది. ఆయాసంతో కూలబడి పోయింది! గురువుగారిని క్రిందపడకుండా రక్షించుకొన్నారు. ఒక చెట్టు క్రింద విశ్రమించారు.

## గుర్రం తెచ్చిన తంటా

గురువుగారు దాని వాలకం చూచి దాహంతో బాధపడుతున్నదని గమనించారు. దాని ముందు పచ్చగడ్డి వేయించారు. అది కొంతసేపు స్థిమితంగా మేత మేసి నెమ్మదిగా నడక సాగించింది దగ్గరలో వున్న చెరువులోనికి దిగి కడుపు పట్టినన్ని నీళ్ళు త్రాగి దాహం తీర్చుకొన్నది. తృప్తిగా సకిలించింది. అక్కడ నుంచి గుర్రం తిరిగి వస్తూ వస్తూ ప్రక్కనున్న చేనులో ప్రవేశించింది. చేను మేయ నారంభించింది. చేను యజమాని దానిని చూచి పరుగు పరుగున వచ్చి పట్టుకొని ఒక చెట్టుకు కట్టివేసినాడు.

కొంత సేపయిన తరవాత గురుశిష్యులు నిద్రనుంచి మేల్కొన్నారు. తిరిగి ప్రయాణం చేయుటకు సిద్ధపడ్డారు. గుర్రం కనపడలేదు. శిష్యులు దాన్ని వెతికి తీసుకువస్తామని బయలుదేరుతుండగా గురువుగారు వద్దని వారించారు. గుర్ర

మెక్కిపోయే బదులు కుంటు కుంటూ అయినా నడిచిపోతేనే మంచిది అన్నారు. శిష్యులు "అమ్మమ్మ అంతమాట అనకండి గురువుగారూ! గుర్రంమీద వెళితే కలిగే గౌరవం నడిచిపోతే కలగదు. కుంటిదయినా గుడ్డిదయినా గుర్రం గుర్రమే కదా! గుర్రంమీదపోతే ఠీవిగా ఉంటుంది కాని, నడిచిపోతే ఉండదు కనుక మామాట వినండి" అని ప్రాధేయపడ్డారు.

శిష్యుల మాట కాదనలేక గురువుగారు "సరే మీకు తోచినట్లే చేయండి" అన్నారు. అలా అనడం తడవుగా వారు గుర్రాన్ని వెదకటానికి బయలుదేరారు. కొంతసేపటికి చేనులో కట్టివేయబడివున్న గుర్రం కనబడింది. దానిని చూచి దగ్గరకు వెళ్ళారు. చేను యజమాని గర్జించాడు. "ఆగండక్కడ. ఇక్కడికెందుకు వచ్చారు?" అని అడిగాడు "ఇది మా గురువుగారి గుర్రం దీనిని తీసుకు వెళ్ళాలని వచ్చాం" అన్నారు శిష్యులు.

చేను యజమాని తన చేతికర్ర పట్టుకొని వారి దగ్గరకు వెళ్ళాడు. వారిని చూచి రైతు కోపంగా "ఇది మీ అబ్బ చేను అనుకున్నారా చేనులో పడి తిని నాకు యెంతో నష్టం కలిగించింది. ఏభై రూపాయలయినా యిస్తేగాని గుర్రాన్ని వదలను. పోయి మీ గురువుగారితో చెప్పి పైకం తెండి" అన్నాడు గట్టిగా.

ఆ శిష్యులు గురువుగారి దగ్గరకు వెళ్ళి ఆ విషయం మనవి చేసుకున్నారు. ఆయన చిరాకుపడుతూ "మనకు గుర్రం ఎందుకు పోనియ్యండిరా అంటే విన్నారు గారు. దీనివలన మనకు అష్టకష్టాలేగాని సుఖమేమీ కలగలేదు. అంత డబ్బు మన దగ్గర లేదు. దీన్ని వదిలిపోవడమే మంచిది" అన్నారు.

శిష్యులు అందుకు అంగీకరించలేదు. గురువుగారు గుర్రంమీదే ప్రయాణం చేయాలన్నారు. ఆయన వారిమాట కాదనలేక మొలలో మంచిగా దాచి ఉంచిన ముప్పయిరూపాయలలో ఇరవై వారి చేతిలో పెట్టి "ఇది ఆ రైతుకు ఇచ్చి ఎలాగో నచ్చచెప్పి గుర్రాన్ని తీసుకురండి"



చెట్టుకి కట్టి ఉన్న గుర్రం

శిష్యులు వేగంగాపోయి రైతుచేతులో ఆ ఇరవైరూపాయలూ పెట్టి గురువుగారి దగ్గిర ఇంత కంటే ఎక్కువ పైకం లేదు. దీనితో తృప్తిపడి గుర్రాన్ని

వదలండి. మీకు పుణ్యముంటుంది. అని బ్రతిమలాడారు. రైతు ఆలోచనలో పడ్డాడు. ఇది చూస్తే గుడ్డిది. పైగా కుంటిది. నేడో రేపో చచ్చేలా ఉంది. ఇటువంటి గుర్రాన్ని ఉంచుకుని లాభంలేదు. మేత దండగ! అనుకొన్నాడు. వారిని చూచి "సరే తీసుకుపోండి. పరమానందయ్యగారి శిష్యులు గదా అని విడిచి పెడుతున్నాను. ఈసారిగాని మా చేనులోకి వచ్చిందంటే చచ్చినా విడువను. త్వరగా తీసుకువెళ్ళండి" అన్నాడు గడుసుగా.

రైతు అలా అన్నందుకు శిష్యులు ఎంతో సంతోషించారు. అతని మంచితనానికి చాలా మెచ్చుకొన్నారు. గబగబా వెళ్ళి చెట్టుకు కట్టివున్న గుర్రం మెడకు కట్టిన త్రాళ్ళు విప్పి, నెమ్మదిగా గురువుగారి వద్దకు నడిపించుకొని వెళ్ళారు. శిష్యులు తెస్తున్న గుర్రాన్ని చూచి పరమానందయ్యగారు లోలోపల చాలా సంతోషించారు నెమ్మదిగా పైకిలేచి శిష్యుల సాయంతో గుర్రమెక్కారు. అడుగులో అడుగువేస్తూ, మధ్య మధ్య ఆగిపోతూ, గుర్రం శిష్యుల సాయంతో ముందుకు సాగుతున్నది. అలా పోగా పోగా కొంత దూరంలో వారు వెళ్ళవలచిన గ్రామం కనబడుతుంది. గ్రామాన్ని చూచి శిష్యుల సమేతంగా పరమానందయ్యగారుకూడా ఎంతో ఆనందించారు. చచ్చిచెడీ ఎలాగయితేనేం గ్రామం చేరుకొన్నాం అని. పరమానందయ్యగారు అక్కడినుంచి నడిచిపోదాం అన్నారు. అందుకు శిష్యులు అంగీకరించలేదు. ఇంత కష్టపడి గుర్రంమీద ఉండగా చూస్తే ఎంతో బాగుంటుంది. మీ గొప్పదనం మరింత పెరుగుతుంది. అని శిష్యులు నచ్చజెప్పనారంభించారు. పరమానందయ్యగారు వారి మాటలు విని "ఔను! మీ అభిప్రాయంకూడా సరైందే. అలాగే కానిద్దాం" అని గుర్రంమీద పోవడానికి అంగీకరించారు. గుర్రాన్ని ముందుకు ఎంతో కష్టపడి నడిపిస్తున్నారు. అది నడవలేక నడవలేక ఆగిపోయింది. ఒక తెలివితక్కువ శిష్యుడు వెనుకనుంచి గుర్రాన్ని ముందుకు త్రోయబోయాడు. దానికి ఎక్కడలేని కోపం వచ్చింది. మంచీ చెడ్డా

ఆలోచించకుండా, ఊపిరి బిగబట్టి, లేని శక్తిని తెచ్చుకొని ఒక తాపు తన్నింది. అక్కడే కూలబడిపోయింది. పరమానందయ్యగారు ఒక మూలా, తాపు తిన్న శిష్యుడు ఒక మూల పడిపోయారు. శిష్యుని ముందు పళ్ళన్నీ ఊడిపోయాయి.



క్రిందపడిన గుర్రం, పరమానందయ్యగారు, శిష్యులు

నోరు అంతా రక్తంతో నిండిపోయింది. గురువుగారు క్రిందపడగానే సొమ్మసిల్లిపోయారు. కొంతసేపటికి మామూలు స్థితి పొంది లేవలేక, కూర్చుండలేక "నడుము విరిగిందిరా! అయ్యో! ఇప్పుడెలాగురా! మీ పాడు గుర్రం సరదా నాకెట్టి కష్టం తెచ్చి

పెట్టిందో చూడండిరా!'' అని మూలుగుతూ, మధ్య మధ్య శిష్యులను తిడుతూ వున్నారు.

జరిగిన భీభత్సకాండ చూసి శిష్యులు భయపడి తలో మూలకూ పారి పోయారు. కొంతసేపటికి ఎలాగో ధైర్యం తెచ్చుకొని గురువుగారి దగ్గరకు వెళ్ళారు. ''గురువుగారు మావల్ల తప్పయిపోయింది. మమ్మల్ని క్షమించండి'' అని కాళ్ళ మీద పడి బ్రతిమాలుకున్నారు. మరియొక ప్రక్క గుర్రం తాపువల్ల పళ్ళూడగొట్టుకొని ఏడుస్తున్న తమ స్నేహితుని చూచి గొల్లుమని ఏడ్వసాగారు.

వారి ఏడుపు చూచిన గురువుగారికి కూడా దుఃఖం ముంచుకు వచ్చింది. అలా కొంతసేపు దుఃఖించారు. గుర్రంతాపుకు గురయిన శిష్యుడు సమీపంలో ఉన్న కాలువకుపోయి నోరు, ముఖం బాగా కడుగుకొన్నాడు. శిష్యులు అంతా కలిసి ఎంత ప్రయత్నించినా గురువుగారిని పైకి లేపదియలేకపోయారు.

ఇంతలో ఆ ప్రాంతమునకు ఒక గ్రామస్తుడు వచ్చాడు. అతడు పరమా నందయ్యగారి శిష్యకోటికి చెందినవాడు. జరిగిన సంగతులన్నీ విని జాలిపడ్డాడు. గబ గబ గ్రామంలోనికి పోయి ఒక ఎద్దుల బండిని తీసుకొని వచ్చాడు. అతనితో పాటు మరికొందరు గ్రామస్తులు కూడా వచ్చారు. అంతా కలిసి గురువుగారిని బండిలో కూర్చోబెట్టారు. బండి కదిలింది. శిష్యులు బ్రతుకు జీవుడా అనుకొని బండి వెనుక బయలుదేరారు. గుర్రం మాత్రం అక్కడే కూలబడి ఉంది. పోతున్న గురు శిష్యుల వంక జాలిగా చూసింది. వారు మాత్రం దాని ముఖం కూడ చూడలేదు.

పరమానందయ్యగారు పది నిమిషాలలో ఆ గ్రామం చేరుకొన్నారు. శిష్య కోటి ఆయన స్థితి చూచి బాధపడ్డారు. రామాలయంలో వున్న చిన్న గదిలో బస

ఏర్పాటు చేశారు. గురువుగారి కోరికపై ఆముదం కాచి నడుముకు, కాళ్ళకు రాచి రాత్రి అంతా మర్దన చేశారు. అలా రెండు మూడు రోజులు చేయగా పరమానందయ్యగారు మామూలు ప్రకారం పైకిలేచి తిరగనారంభించారు. ఆయన పైకి లేచి తిరగడం శిష్యులకేగాక గ్రామస్తులకు కూడా సంతోషం కలిగింది.

## పరమానందయ్య శిష్యుల పురాణ కాలక్షేపం

గ్రామస్తులు ఒకనాడు పరమానందయ్యగారిని దర్శించి వారి యోగ క్షేమములు తెలిసికొన్నారు. ఆ సందర్భంలో వారు "గురువుగారు రాక రాక మా గ్రామమునకు వచ్చారు. మాకు ఎంతో ఆనందంగా ఉంది. ఏదయినా పురాణ కాలక్షేపం యేర్పాటుచేసి మమ్మల్ని ఆనందింపజెయ్యండి!" అని వినయంగా వేడుకొన్నారు.

గురువుగారు "దానికేం భాగ్యం! నా శిష్యులు ఎంతో తెలివైనవారు. వారు రామాయణ, భారత, భాగవత గ్రంథాలన్నీ చదివారు. వారిచే రేపటి నుంచి పురాణ కాలక్షేపం జరిపిస్తాను" అని వాగ్దానం చేశారు. తమ శిష్యుల తెలివితేటలు గ్రామస్తులకు తెలియజేయాలని పరమానందులవారు అనుకొన్నారు.

మరునాడు రాత్రి గ్రామస్తులంతా త్వరగా భోజనాలు చేసి రామాలయానికి వచ్చారు. చాలాకాలానికి తమ గ్రామంలో పురాణ కాలక్షేపం జరుగుతున్నందుకు మురిసిపోతున్నారు. గురువుగారి ఆదేశంపై ఒక శిష్యుడు వచ్చి వేదికపై నిలబడ్డాడు. ఒక గ్రామస్తుడు పూలమాలతెచ్చి ఆయన మెడలో వేశాడు. అంతా చప్పట్లు కొట్టారు.

అప్పుడు ఆ శిష్యుడు గ్రామస్తుల వేపు చూచి "సోదర సోదరీ మణులారా! నేను చెప్పబోయే కథ యెంతో గొప్పది. పవిత్రమైనది, ఎంత విన్నా తనివి తీరనిది. అది యేదో మీకు తెలియునా?" అని ప్రశ్నించగా గ్రామస్తులు "మాకు తెలియదయ్యా!" అని వినయంగా చెప్పారు. వారి మాటలు విని ఆ శిష్యుడు "తెలియని వారికి ఏమి చెప్పినా తెలియదు. మీకు చెప్పి లాభం లేదు" అని వేదిక దిగి వెళ్ళిపోయాడు. అతని మాటలు విని గ్రామస్తులు తెల్లబోయారు. నిరాశతో తిరిగి యింధ్లకు పోయారు.

గ్రామస్తులు మరునాడు పరమానందయ్యగారిని కలుసుకొని రాత్రి జరిగిన సంగతులు చెప్పి "ఇదేం పురాణ కాలక్షేపం స్వామి!" అని అడిగారు. గురువుగారు వారి మాటలు విని బాధపడ్డారు రాత్రి మరియొక శిష్యునితో పురాణ కాలక్షేపం జరిపిస్తానని వాగ్దానం చేసి పంపారు.

రాత్రి ఎనిమిది గంటలకు గ్రామస్తులంతా పురాణ కాలక్షేపము జరుపుకొనుటకు రామాలయం వద్ద చేరారు. పరమానందయ్యగారి మరియొక శిష్యుడు వేదిక పైకి వచ్చి నిలబడ్డాడు. అంతా కరతాళధ్వనులు చేశారు. శిష్యుడా గ్రామస్తుల నుద్దేశించి "అన్నలారా! తమ్ములారా! అక్కలారా! చెల్లెళ్ళులారా! నేను చెప్పబోవు కథ మీకు తెలియునా?" అని అడిగాడు. గ్రామస్తులు "మాకు తెలిస్తే నీ దగ్గర కెందుకు వస్తామయ్యా" అందామనుకొన్నారు కాని అలా అంటే ఆయనను ఎత్తి పొడిచినట్లుగా ఉంటుందని భావించి, తెలియదంటే రాత్రి జరిగినట్లే జరుగుతుందేమో అని సందేహించి "తెలుసు! తెలుసు!" అన్నారు. ఆ మాటలు విని శిష్యుడు "తెలిసిన వాళ్ళకు నేను చెప్పవలసిన పనిలేదు!" అని వేదిక దిగి వెళ్ళిపోయాడు. గ్రామస్తులు తెల్లబోయారు. తెలుసునని చెప్పి పొరపాటు చేశాం,

ఈసారి అలాకాకుండా కొందరు తెలుసునని, కొందరు తెలియదని అనికూడ బలుకు కొని వెళ్ళిపోయారు.

పరమానందయ్యగారు రెండవరోజునకూడా పురాణ కాలక్షేపం జరగ సందుకు చాలా బాధపడ్డారు. ఇక శిష్యులతో లాభంలేదని తామే ఆనాటి రాత్రి పురాణ కాలక్షేపం జరపడానికి నిశ్చయించుకొన్నారు. ఆ సంగతి విని గ్రామస్థులు ఎంతో ఆనందించారు.

మూడవనాడు రాత్రి మామూలుకంటే ఎక్కువమంది రామాలయం వద్దకు వచ్చారు. ఎనిమిది గంటలకు గురువుగారు వచ్చి వేదికపై నిలబడ్డారు. గురువుగారే స్వయంగా కథ చెప్పుటకు సిద్ధపడటం తమ అదృష్టంగా భావించారు పెద్ద పూల మాల తెచ్చి మెడలో వేశారు. పావుగంట కరతాళ ధ్వనులతో ఆ ప్రదేశం మారు మ్రోగిపోయింది.

అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. పరమానందయ్యగారు గ్రామస్థులను చూచి "శిష్యులారా! నేను చెప్పనున్న కథ మీకు తెలియునా?" అని అడిగారు. గ్రామస్థులు గురువుగారి మాటలు విని ముందే ఆలోచించుకొన్నట్లు కొందరు తెలుసునని, కొందరు తెలియదని చెప్పారు. వారి మాటలు విని గురువుగారు "మీలో కొందరికి తెలుసు కనుక తెలియనివారు తెలిసినవారినడిగి తెలుసుకోవచ్చు నేనిక చెప్పవలసిన పనేముంది" అని కూర్చున్నారు.

గురువుగారి మాటలు విని గ్రామస్థులు "గురువుగారికి తగిన శిష్యులు శిష్యులకు తగిన గురువు!" అని గుసగుసలాడుకొంటూ ఒక్కొక్కరే లేచి ఇండ్లకు వెళ్ళిపోయారు. వేదికపై గురుశిష్యులు మాత్రం మిగిలారు తమ తెలివికి తామే సంతోషిస్తూ.

మరునాడు గురుశిష్యులకు ఆ గ్రామంలో మంచినీళ్ళుకూడా దొరకలేదు. ఒక్కరయినా వచ్చి పలుకరించలేదు. విశేష ధనధాన్యములు లభిస్తాయని కొండంత ఆశతో వచ్చిన గురువుగారు శిష్యులతో ఆ రోజంతా పస్తు పడుకొన్నారు. రాత్రి ఎలాగో గడిపి తెల్లవారుజామునలేచి గ్రామస్తులెవరికీ కనబడకుండా బయలుదేరి తమ స్వగ్రామానికి వెళ్ళిపోయారు.

## గుర్రం యొక్క విశ్వాసం

అష్టకష్టాలుపడి గురు శిష్యులు ఎలాగో పరమానందపురం చేరారు. గురువుగారి యింటిముందు చావు బ్రతుకులలో వున్న వారి గుర్రం కనబడింది. దానిని చూచి శిష్యులు "గురువుగారూ! మన గుర్రం మనకంటే ముందే మన యింటికి వచ్చేసింది. అదిగో చూడండి" అని చూపించారు. గురువుగారు తమ ఇంటిముందు పరుండి యున్న గుర్రాన్ని చూచి "కర్మరా! ఇదంతా నేను చేసుకున్న కర్మ? నేను వద్దంటే మీరు విన్నారు కాదు. బలవంతంగా తెచ్చి అంటగట్టారు. ఇది నన్ను వదిలేలా లేదు" అంటూ యింటి లోనికి వెళ్ళిపోయారు.

శిష్యులు గుర్రం చుట్టూ మూగారు. చావు బ్రతుకులలో వున్న దానిని చూచి జాలిపడ్డారు. మనం వదిలినా ఇది మనల్ని వదిలేలా లేదు. కుక్క తరువాత విశ్వాసం గల జంతువులలో గుర్రం ముఖ్యమైనదని గురువుగారు మనకు ఏనాడో చెప్పారు. వారిమాటలు అక్షరాలా నిజమైనవని ఇప్పుడు తెలుసుకున్నాం. ఇంత విశ్వాసం గల జంతువు కష్టంలో వున్నప్పుడు చూస్తూ వూరుకోవడం ధర్మంకాదు. దీనినెలాగయినా రక్షించాలి అని నిశ్చయించుకొన్నారు. వారి నిశ్చయం గుర్రం

తాపు తిని పశ్చాదగొట్టుకునవి శిష్యునికి మాత్రం నచ్చలేదు. దీనివల్ల గురువుగారికి కూడా గొప్ప కష్టం కలిగింది. ఇటువంటి గుర్రాన్ని రక్షించాలా అని అడిగాడు. దానికి సమాధానంగా మరొక శిష్యుడు యిలా అన్నాడు—"గురువుగారు లోగడ మనకు బోధించిన ప్రకారం భూతదయ కలిగి ఉండాలి. ఏ జీవి కష్టంలోవున్నా కాపాడటానికి ప్రయత్నించడం మానవ ధర్మం అని చెప్పారు. గురువుగారు లోగడ యిచ్చిన ఆజ్ఞ ప్రకారం మనం దీనిని కాపాడటానికి ప్రయత్నించాలి! తప్పదు."

అతని మాటలు అంతా బలపరిచారు. గురువుగారి అనుమతిపొంది ఆ గుర్రాన్ని ఎండనుండి, వాననుండి కాపాడటానికి ఓ పాక వేయాలని తీర్మానించు కొన్నారు. అలా తిర్మానించుకుని గురువుగారి వద్దకు వెళ్ళారు.

ఆ సమయంలో గురువుగారూ, సుందరమ్మగారూ తగవుపడుతున్నారు. సుందరమ్మగారు "అంతదూరం పోయి, కష్టకష్టాలు పడి వట్టి చేతులతో తిరిగి వచ్చారు. ఇంట్లో ఏముందని తిందామనుకున్నారు? గుర్రం సరదా యిప్పటి కయినా తీరిందా? మనకెందుకండీ గుర్రాలూ, ఏనుగులూ అంటే విన్నారా? ఆ వెర్రి వెంగళప్పలు యెలా ఆడిస్తే అలా ఆడతారా? చావండి, అంతా కట్టగట్టుకుని" అని తలవాచేలా చీవాట్లు పెడుతున్నది. ఆమె మాటలు విని, వాలకం చూచి శిష్యులు హడలి బేజారై తలొక దిక్కుకు పారిపోయారు. పరమానందయ్యగారు భార్య మాటలు విని కిక్కురమనలేదు. "అంతా కర్మ! కర్మ దాటటం ఎవరికి వశమౌతుంది. దైవం అనుకూలంగా లేనప్పుడు మానవ మాత్రులం మనం ఏమి చేయగలం?" అని తల పట్టుకొని కూర్చుండిపోయారు. సుందరమ్మగారు రుసరుస లాడుతూ వంటింటిలో కూర్చున్నారు. కొంతసేపటికి ఆమె కోపం తగ్గింది.

అప్పుడు ఆమె భర్త ఊరికి వెళ్ళి తిరిగి వచ్చినంతవరకు జరిగింది జ్ఞాపకం చేసుకొని బాధపడింది. గుర్రుపెట్టి నిద్రపోతున్న భర్త ముఖం చూచి జాలి పడింది. ఇన్ని కష్టాలుపడి యింటికి చేరిన భర్తకు తిండి లేకుండా చేస్తే మహా పాపం చుట్టుకొంటుందని భయపడింది. గబగబ బియ్యం కడిగి పొయ్యిపై పడ వేసింది. చకచకా వంట పూర్తి చేసింది భర్తను లేపి స్నానానికి పంపింది.

పరమానందయ్యగారు ఇంటినుండిబయటకు వచ్చి చూస్తే ఒక్క శిష్యుడు కూడా కనపడలేదు. వారి సంగతి అడిగితే భార్య మండిపడుతుందని నెమ్మదిగా చెరువుకు వెళ్ళారు స్నానం చేసి రావాలని.

చెరువు గట్టుపై వున్న మర్రిచెట్టు క్రింద విచారంగా కూర్చున్న శిష్యు లను చూచి జాలిపడ్డారు. కాని యింటికి తీసుకొని వెళ్ళటానికి భయపడ్డారు. గురువు గారు స్నానంచేసి ఇంటికి బయలుదేరుతుండగా శిష్యులు ఆయన దగ్గరకు పోయి "గురువుగారూ! ఉదయంనుండి మాకు తిండిలేదు. ఆకలితో మాడిపోతున్నాం. ఇప్పుడు యేం చేయాలో, ఎక్కడికి పోవాలో మాకు తోచడంలేదు. మిమ్మల్ని వదిలి పోవటానికి మనసొప్పడం లేదు" అని మనవి చేసుకున్నారు. వారి మాటలు విని పరమానందయ్యగారు చాలా బాధపడ్డారు. వెంటబెట్టుకొని వెళ్ళడానికి భయ పడ్డారు. "మీరు శుభ్రంగా స్నానంచేసి ఒక గంట తరువాత ఇంటికి రండి. ఈ లోపుగా ఏదయినా మార్గం ఆలోచిస్తాను" అని చెప్పి ఇంటికి పోయారు. గురువు గారి మాటలు శిష్యులకు కొండంత ధైర్యాన్నిచ్చాయి. అలాగే చేస్తామన్నారు.

పరమానందయ్యగారు ఇంటికి వచ్చి భార్య వడ్డించిన విస్తరి ముందు కూర్చున్నారు. కాని ఆయనకు తినబుద్ధి కావడంలేదు. "విస్తరి ముందు కూర్చుని ఆలోచిస్తున్నారేమిటి? తినండి?" అన్నారు సుందరమ్మగారు. "ఏం లేదు సుందరి!

దిక్కూ మొక్కూలేని ఆ కుర్ర వెధవలు, తిండిలేక చస్తున్నారు. వాళ్ళకు మనం తప్ప ఎవరున్నారు చెప్పు?" అన్నారు జాలిగా పరమానందయ్య. ఆయన మాటలు విని సుందరమ్మగారు ఆశ్చర్యపడుతూ "వాళ్ళు ఎక్కడకు పోయారో, ఎక్కడ తిండిలేక చస్తున్నారో నాకు తెలియదు. వారు నాకు కనపడలేదు. మీరు ఎక్కడి కయినా పంపారేమో అనుకొంటున్నాను. వారిని నేనేమీ అనలేదు కూడా" అని చెప్పింది.

పరమానందయ్యగారు ఆలోచనలో పడ్డారు. "బహుశా వారు మనం తగువుపడుతున్నప్పుడు విని వుంటారు. నీ ధోరణి చూచి భయపడి పారిపోయి వుంటారు" అని భార్యవైపు చూచి పరమానందయ్యగారు పకపక నవ్వారు. "సరే వాళ్ళ సంగతి తర్వాత ఆలోచిద్దాం ముందు మీ భోజనం కానివ్వండి" అంది సుందరమ్మ భార్య ఆజ్ఞపై పరమానందయ్యగారు త్వరగా భోజనం చేసి పైకి లేచారు.

అదే సమయానికి శిష్యులు స్నానాలు చేసి గురువుగారి యింటికి వస్తున్నారు. శిష్యులు కనబడితే పిలుద్దామని సుందరమ్మగారు వీధి గుమ్మంలో నిలబడ్డారు. దూరం నుండి ఆమెను చూచి శిష్యులు వెనుకకు మరలి పోతున్నారు. అప్పుడు పరమానందయ్యగారు వీధిలోకిపోయి "భయపడకండి! రండి! నేనుగాని, అమ్మగారుగాని మిమ్మల్ని ఏమీ అనం" అని చేతితో సంజ్ఞచేశారు. గురువుగారి మాటలు విని శిష్యులు ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా వచ్చారు. సుందరమ్మగారు వారికి కడుపునిండా తిండిపెట్టి సంతోషపెట్టారు.

శిష్యులు భోజనాలు చేస్తున్న సమయంలో పరమానందయ్యగారు వీధిలోనికి వచ్చి అరుగుపై పచార్లు చేస్తుండగా, అచ్చటికి కొంతదూరంలో నున్న చెట్టుక్రింద పడి మూలుగుతున్న గుర్రం కనపడింది. చూడగానే దానిపై ఆయనకు

ఎంతో ఆగ్రహం కలిగింది. అంతలోనే జాలికూడా కలిగింది. ఎక్కడో దూర ప్రాంతంలో వదిలిపెట్టినా మొత్తానికి, ఎలాగో కుంటుకుంటూ తమ ఇంటికివచ్చిన ఆ గుర్రంయొక్క విశ్వాసమును కాయన చాలా సంతోషించారు. నెమ్మదిగా దాని దగ్గరకు వెళ్ళి చూశారు. అది తిండిలేక బాధపడుతూ కొన ఊపిరితో నున్నదని గ్రహించారు. అప్పుడే భోజనములుచేసి బయటకు వచ్చిన శిష్యులను పిలిచి, పచ్చి గడ్డి, తెప్పించి పెట్టించారు.

## పరమానందయ్య శిష్యుల భూతదయ

మూడు రోజులు గడిచాయి గుర్రం కాస్త పైకి తేవగలుగుతోంది అది తిరగడానికి యింకా కొంతకాలం పట్టినా మొత్తానికి బ్రతుకుతుందనే ఆశ గురు శిష్యులకు కలిగింది. ఒకనాడు గురువుగారు సతీసమేతంగా కూర్చుని కులాసాగా మాట్లాడుకొంటున్నారు. అదే తగిన సమయమని శిష్యులు వారి దగ్గరగా పోయి "గురువుగారు మన గుర్రం వానకు తడిసి, యెండకు యెండి, చలికి గజగజ వణుకుతూ బాధపడుచున్నది. దానికి ఒక పాక నిర్మించాలని మేము నిశ్చయించుకొన్నాము. తమరు ఆజ్ఞాపిస్తే యిప్పుడే ఆ పని మొదలు పెడతాము" అన్నారు.

శిష్యుల మాట విని సుందరమ్మ కోపించి "ఆ ముసలి గుర్రంమీద మీకింకా మోజు పోలేదా? దానిమీద మళ్ళీ మీ గురువుగారిని తీసుకువెళదామను కుంటున్నారా? జరిగిన ముచ్చట్లు చాలు, దాని దారిన అదే పోతుంది దానికి మీరు గుడిసె నిర్మించ వలసినపనిలేదు" అని మందలించారు. శిష్యులు ఆమె వంక దీనంగా చూస్తూ "అమ్మా! గురువుగారు మాకు లోగడ భూతదయ గురించి బోధించినారు. నోరులేని జీవులను రక్షించడం మానవధర్మములలో ముఖ్యమైనదన్నారు. అందు

వల్ల మేము దానికి గుడిసె నిర్మించాలనుకున్నాం గాని, మీ ఆజ్ఞలేకపోతే మేము ఆ పని చేయము" అని గురువుగారి ముఖం చూచారు.

పరమానందయ్యగారు శిష్యుల మాటలు విని తల ఊపించి "సుందరీ. ఓరికి నేను అలా బోధించిన మాటలు నిజమే. మనకు ఉపయోగపడకపోయినా నోరులేని జీవులపట్ల మనం దయ కలిగి వుండాలి. వాటికి కష్టం కలిగినప్పుడు కాపాడుటకు ప్రయత్నించాలి. ఇది సనాతన ధర్మములలోనొకటి కనుక పీకైనంత వరకు మనం ఆచరించాలి, అప్పుడే మనం భగవంతుని ప్రేమ పొందగలం" అని చెప్పారు.

భర్త మాటలు విని సుందరమ్మగారు "మీకు ఎలా ఇష్టమైతే అలా చేయండి. నాకి ధర్మాలన్నీ యేం తెలుసు చెప్పండి" అన్నారు. అప్పుడు గురువు గారు శిష్యులను చూచి "మీరు తలపెట్టిన కార్యం ప్రశంసనీయమైంది. శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు వెంటనే గుడిసెను నిర్మించండి" అని అనుమతించారు.

గురువుగారి అనుమతి లభించగానే శిష్యులంతా ఒక్కచోట సమావేశ మయ్యారు గుడిసె ఏ విధంగా వేయాలో, దాని కవసరమైన వస్తువులేవో దీర్ఘ చర్చల అనంతరం గ్రహించారు. గుడిసె వేయుటకు ముఖ్యంగా తాటాకులు కావాలి కనుక వాటిని సంపాదించుటకు తమలో ఒకణ్ని యెన్నుకొన్నారు! అతడు ఎవరి నడిగినా తాటాకులు దొరకలేదు. అతనిని చెట్టు యెక్కి కోయ మన్నారు. అతడికి చెట్టు దిగడం వచ్చుకాని ఎక్కడంరాదు అన్నాడు. ఎవరయినా యెక్కిస్తే తాటా కులు కోసి తెస్తానన్నాడు. కోసిన తరవాత దిగి రాగలనన్నాడు. అతన్ని చెట్టు ఎక్కించడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఇక లాభం లేదనుకొని, అడవికిపోయి కట్టెలు తెచ్చి గుడిసె వేయడానికి నిశ్చయించుకొన్నారు.

శిష్యులలో ఒకణ్ని అడవికిపోయి కట్టెతేవడానికి నియమించారు అతడు గొడ్డలి భుజంమీద వేసుకొని అడవికి బయలుదేరాడు. ఒక పెద్ద చెట్టును చూచి పైకి యెక్కి క్రిందనున్న కొమ్మభాగాన్ని నరుకుతున్నాడు. ఆ దారిని పోతున్న ఒక బ్రాహ్మణుడు కొమ్మ నరుకుతున్న బాలుణ్ని చూచి, దగ్గరకు వెళ్ళి "ఏం నాయనా! చావాలనుకొంటున్నావా? కొమ్మ పైభాగాన నిలబడి క్రిందభాగం నరకుతున్నావు. కొమ్మతోపాటు క్రిందపడి చస్తావు. ఆగు! ఆగు!" అని బిగ్గరగా చెప్పాడు.

## నిజమైన జోస్యం

ఆయన మాటలువిని చెట్టుకొమ్మ నరుకుతున్న బాలుడు "నీ దారిని నీవు పోక నాకు నీతులు చెపుతున్నావే. నేనేం తెలివిలేనివాణ్నను కొంటున్నావా? నేనెవరినో తెలుసా? పరమానందయ్యగారి శిష్యుణ్ని!" అని సగర్వంగాచెప్పాడు.

అతని మాటలు బ్రాహ్మణుడువిని నవ్వుకొన్నాడు. పిల్లవాడు ప్రమాద పరిస్థితిలో ఉన్నందుకు జాలిపడి "నీ తలవ్రాత నెవరు తప్పిస్తారు. హితవు కోరి చెప్పిన వారి మాటలు వినకపోతే కలిగే ఫలితం నీకే తెలుస్తుంది" అని తనదారిన తాను పోసాగాడు.

శిష్యుడు ఆ కొమ్మను మళ్ళీ రెండుసార్లు నరికాడు. ఆ కొమ్మ ఫెళ ఫెళ మంటూ క్రిందపడింది. దానితోపాటు అతనుకూడా క్రిందపడ్డాడు. అదృష్ట వశాత్తు గట్టి దెబ్బలేవీ తగులలేదు. పైకి లేచి కూర్చుని బాగా ఆలోచించి,

ఈ బ్రాహ్మణుడు సామాన్యుడు కాదు. గొప్ప జ్యోతిష్కుడై వుంటాడు. కాకుంటే నేను చెట్టుమీద ఉండగానే పడిపోతానని ముందుగానే ఎలా చెప్పగలడు? అని నిశ్చయించుకొన్నాడు. ఆ బ్రాహ్మణుడు వెళ్ళిన దిక్కుకు పరిగెత్తి వెళ్ళాడు.



చెట్టుకొమ్మ విరిగి క్రిందపడిన పరమానందయ్య శిష్యుడు

కష్టపడి ఆయనను కలుసుకొన్నాడు. ఆయనపాదములమీదపడి "మీరు సామాన్యులు కారు. గొప్ప జ్యోతిష్యపండితులై వుంటారు. చూస్తూనే నా భవిష్యత్తు చెప్పేశారు. నా యందు దయవుంచి ఒక సంగతి చెప్పివెళ్ళండి. మా గురువుగారు బాగా వృద్ధులై

పోయారు. ఈ మధ్య తరచుగా వారికి ఏదో రోగం వస్తున్నది. మేము పన్నెండు మంది శిష్యులం ఉన్నాం. మేమంతా వారినే నమ్ముకొని, భక్తిశ్రద్ధలతో సేవిస్తూ బ్రతుకుతున్నాం. వారు లేకపోతే మేం దిక్కులేని పశులమైపోతాం. నేను వారి ప్రియశిష్యుణ్ని. ఆయన చచ్చిపోతే నాకు చాలా దుఃఖం వస్తుంది. బెంగతో మంచ మెక్కిపోతాను. కనుక వారికి తుదిఘడియలు యెప్పుడు వస్తాయో, చచ్చేముందు వారిలో ఏమే గుణాలు కనబడగానే మేమంతా చుట్టూచేరి వారి ప్రాణం పోకుండా చూస్తాం. దయవుంచి చెప్పి వెళ్ళండి!" అని ప్రాధేయపడ్డాడు.

## గురువుగారి ప్రాణంపోయే సమయం

అంతగా కోరుతున్న వ్యక్తికి ఏమీ చెప్పకుండా వెళ్ళడం భావ్యంకాదని భావించి బ్రహ్మణుడు ఇలా అన్నాడు. "నాయనా! నీ గురుభక్తికి నేను ఎంతో ఆనందిస్తున్నాను. వారిప్రాణం ఎప్పుడు పోతుందో చెపుతాను విను. ఎప్పుడాయన గుండె కొట్టుకోవడం ఆగిపోతుందో, అప్పుడాయన ప్రాణం పోతుంది." అనిచెప్పి తనదారిన నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు. ఆయన మాటలువిని శిష్యుడు ఏదో ఘనకార్యం సాధించినట్లు సంతోషిస్తూ గబగబ చెట్టువద్దకు వచ్చాడు. క్రింద పడి వున్న కొమ్మనీడ్చుకొంటూ గురువుగారి యింటికి చేరాడు.

అచ్చట ఉన్న మిగిలిన శిష్యులంతా అతనిని చూచి ఇక గుడిసె నిర్మాణం ప్రారంభించవచ్చు అని లేచి నిలబడ్డారు అతని చేతిలోవున్న కొమ్మను ఇంటి ముందు వుంచి, గబగబ లోనికిపోయి గురువుగారి రెండు పాదాలూ పట్టుకొని "నేను ఈ వేళ చచ్చిపోవలసిందే. మీదయవల్ల బ్రతికాను. అడవిలోపోతున్న ఒక జ్యోతిష్కుడు నాకురానున్న ఆపదగురించి ముందే చెప్పాడు. కాని నేను ఆయన

మాట నమ్మలేదు. చెట్టుకొమ్మ నరుకుతూ క్రిందపడ్డాను. కాని అంతగా దెబ్బలేవీ తగులలేదు. వెంటనే పరుగెత్తుకొని వెళ్ళి ఆ మహానుభావుణ్ని కలుసుకొని మీ భవిష్యత్తు గురించి అడిగి తెలుసుకొన్నాను, మీ గుండె ఎప్పుడైతే కొట్టుకోవడం ఆగిపోతుందో అప్పుడు చనిపోతారట!'' అని ఏడుస్తూ చెప్పాడు.

శిష్యుని మాటలు విని గురువుగారు గాభరాపడ్డారు. తమ గుండె కొట్టుకొంటున్నదో లేదో అని చెయ్యి గుండెమీద పెట్టి చూచారు. ఆయన స్థూలకాయం గలవారు కావడంవల్ల చేతికి గుండె కొట్టుకొంటున్న జాడ తెలియలేదు, పరమానందయ్యగారు తమ గుండె ఆగిపోయిందనుకున్నారు. వెంటనే మంచం మీద పడుకున్నారు లోపల వున్న భార్యను పిలిపించి "సుందరీ! ఇక నీకూ నాకూ ఋణం తీరిపోయింది. ఇకముందు నువ్వు ఎలా జీవిస్తావో తెలియదు మన శిష్యులంతా యెలా బ్రతుకుతారో అర్థం కావడంలేదు. పాపం! వీళ్ళు దిక్కులేనివాళ్ళు! మనల్నే నమ్ముకొని వున్న అమాయక జీవులు'' అని చెపుతూ పోతున్నారు.

భర్త మాటలు విని సుందరమ్మగారు ఆశ్చర్యపడి "ఇప్పుడేం జరిగిందండి! ఇప్పుడు అంతా బాగానే వున్నాం కదా!'' అని అడిగారు. భార్య మాటలు విని ఆయన గద్గర స్వరంతో "ఏం బాగున్నాం? నా గుం డెఆగిపోయింది. కాసేపటికో కూసేపటికో యమదూతలు వచ్చి తీసుకుపోతారు'' అని చెపుతుండగా సుందరమ్మగారు పకపకనవ్వి "గుండె కొట్టుకోవటం ఆగిపోతే మీరిన్ని మాటలెలా మాట్లాడతారండీ! ఏదీ మీ గుండె చూడనివ్వండి'' అని ఆయన గుండెపై చెయ్యి అదిమిపెట్టి చూచి "అనుమానం పెనుభూతం అన్నారు. మీ గుండె లక్షణంగా కొట్టుకొంటున్నది దిగులు పడకండి. పైకి లేపండి!'' అని చెప్పింది.

భార్య మాటలు విన్న పరమానందయ్యగారికి ఎక్కడలేని శక్తి పుట్టుకు వచ్చింది. మంచం దిగి మామూలుగా నడిచి వీధిలోకి వెళ్ళారు. గురువుగారు ఏమవుతారో అని విచారంగా అరుగుపై శిష్యులంతా కూర్చున్నారు. గురువుగారిని చూచి ఎంతో ఆనందించారు.



గుడిసెలో సగం మాత్రమే పట్టిన గుర్రం

తరువాత అంతా కలిసి గుర్రానికి గుడిసె వేశారు ఎంతో కష్టపడి వేసిన ఆ గుడిసెలోనికి గుర్రాన్ని అతి కష్టంమీద పంపారు. అది దాని

సగం శరీరం దాచుకోవడానికి మాత్రమే ఉపయోగకరంగా వుంది. అది చూచి వారు తమ చేతగానితనాన్ని గ్రహించలేక గుర్రం అదృష్టం బాగులేదని నిశ్చయించుకొన్నారు. ఏమయినా గుడిసె వేసినందుకు ఎంతో ఆనందించారు. పరమానందయ్య గారు వారిని ఎంతో ప్రశంసించారు. తమ శిష్యులు గొప్ప భూత దయ గలవారని. అటువంటి శిష్యులు మరో గురువునకు ఉండరని నిశ్చయించుకొన్నారు.

## ఒంటెద్దు బండిలో ఊరి ప్రయాణం

ఇంతలో ఒక గ్రామం నుంచి గురువుగారిని రమ్మని ఆహ్వానం వచ్చింది. శిష్యులు గుర్రంమీద తీసుకొని వెళ్ళాలనుకున్నారు. నేను జన్మలో యిక గుర్రం యెక్కనని పరమానందయ్యగారు ఖండితంగా చెప్పేశారు. శిష్యులు అయిష్టంగానే "చిత్తం! తమ యిష్టప్రకారమే చేద్దాం" అన్నారు.

పరమానందయ్యగారు సతీ సమేతంగా ఒంటెద్దు బండిలో సంచారం చేయ డానికి బయలుదేరారు. శిష్యులు బండి వెనుక నడిచి వెళుతున్నారు. కొంత దూరం వెళ్ళిన తరవాత గురువుగారు శిష్యులను పిలిచి "బండిలో నుంచి ఏమైనా సామానులు క్రిందపడుతుంటాయి జాగ్రత్తగా చూస్తూండండి! కాస్త మేం నడుం వాల్చు తుంటాం" అని పడుకున్నారు.

శిష్యులు "చిత్తం అలాగే చూస్తాం" అన్నారు. బండి కొంతదూరం వెళ్ళింది. బండి కుదుపుకు నెమ్మది నెమ్మదిగా జరిగి మరచెంబు క్రింద పడింది. శిష్యులు అది క్రిందపడటం చూశారుగాని ఒక్కరయినా దానిని తీసి బండిలో పెట్టలేదు. గురువు గారు జాగ్రత్తగా చూడమని చెప్పారుగాని మనల్ని తీయమని చెప్పలేదు. కనుక

దానిని ముట్టుకోవటం తప్పు అని నిర్ణయించుకున్నారు. బండి వెనుక పోతూ చెంబు కనబడినంతవరకూ చూశారు.



పరమానందయ్య ఒంటెద్దు బండిలో ప్రయాణం

బండి చాలా దూరం వెళ్ళిన తరవాత పరమానందయ్యగారికి మెలుకువ వచ్చింది కాస్త మంచితీర్థం పుచ్చుకొని దాహం తీర్చుకోవాలనుకున్నారు. ఎంత వెదికినా మరచెంబు కనపడలేదు. శిష్యులను పిలిచి "మరచెంబు చూశార్రా?" అని అడిగారు. అంతా ఒక్కసారిగా "చూశామండి" అన్నారు. "ఏది?" అని గురువు

గారు అడుగగా "ఇక్కడికి చాలా దూరంలో మరచెంబు క్రింద పడిందండి. జాగ్రత్తగా చూస్తూ వచ్చాం" అన్నారు "చూస్తూ రావడమేమిటి? దానిని తీసి తేలేదా?" అని ప్రశ్నించారు సుందరమ్మగారు "తేలేదమ్మా! గురువుగారు ఏ వస్తువైనా క్రిందపడితే జాగ్రత్తగా చూస్తూండమని చెప్పారండి. తెమ్మని చెప్ప లేదు." అన్నారు శిష్యులు "మా కర్మకొద్దీ దొరికారా మీరు ఎన్నిటికని ఓర్చు కోవాలి! ఎన్ని నష్టాలని భరించాలి. ఇంతమంది శిష్యులుండి మాకేం లాభం? తిండి దండగ. ఇక ఒక్క రోజయినా మా దగ్గర వుండటానికి వీల్లేదు. పొండి యెక్కడి కయినా" అని సుందరమ్మగారు మండిపడసాగారు శిష్యులు గురువుగారి పాదాలు పట్టుకొని "మా వల్ల తప్పయిపోయింది. ఇకముందు ఇటువంటి పొరపాట్లు చేయ కుండా జాగ్రత్తగా వుంటాం" అని బతిమాలుకొన్నారు.

పరమానందయ్యగారు వారినిచూచి జాలిపడి "బండినుండి ఏదయినా క్రిందపడితే తీసి బండిలో వేయండి!" అని చెప్పి ప్రయాణం సాగిస్తున్నారు. కొంత దూరం పోయేసరికి చీకటి పడింది. పరమానందయ్యగారు సతీసమేతంగా నిద్ర పోతున్నారు. ఆ సమయంలో ఎద్దు నాలుగయిదుసార్లు పేడ వేసింది. శిష్యులు దానిని జాగ్రత్తగా తీసి బండిలో వేశారు. బండిలో పడుకొన్న పరమానందయ్య దంపతుల పాదాలు పూర్తిగా పేడలో మునిగిపోయాయి. నిద్రమత్తులో వారు పాదాలు పైకి ఎత్తి గోక్కోవటం, అటూ ఇటూ కదలడం జరిగింది. అప్పుడు పేడ చేతుల ద్వారా ముఖాలకు, తలలకు అంటింది. బట్టమీదకూడా పేడ అంటుకొన్నది. గాఢనిద్రావశులయిన వారికి అదేమీ తెలియలేదు.

తెల్లవారుతున్న సమయానికి బండి వారు పోదలచిన గ్రామం సమీపించింది. పరమానందయ్యగారూ, సుందరమ్మగారూ నిద్రనుండి మేల్కొన్నారు. ఒకరి

ముఖం ఒకరు చూసుకొని తెల్లబోయారు. బండి అంతా పేడ మయమైవుంది. తమ ముఖాలు, దుస్తులు, సామానులు పేడతో నిండి అసహ్యంగా కనబడుతున్నాయి, సుందరమ్మగారు మండిపడుతూ "ఈ చండాలమంతాబండిలోకి ఎలా వచ్చింది" అని శిష్యుల నడిగారు. శిష్యులు సగర్వంగా "మేమే వేశామమ్మా గురువుగారు బండిలోనుంచి ఏమి క్రిందపడినా తీసి బండిలో వేయమని ఆజ్ఞాపించారు. వారి ఆజ్ఞానుసారం మన ఎద్దు పేడవేసిన పేడ అంతా జాగ్రత్తగా ఎత్తి బండిలో వేశాం" అన్నారు.

శిష్యుల మాటలు విన్న పరమానందయ్యగారికీ సుందరమ్మగారికీ నవ్వాలో, ఏడవాలో, వారినేమనాలో తోచలేదు. "తమ కర్మకాలి యిటువంటి శిష్యులు దొరికారు." అని బాధపడుతూ, బండిదిగి సమీపంలో వున్న చెరువుకు పోయి శరీరం, బట్టలూ శుభ్రం చేసుకున్నారు. శిష్యుల్నికూడా వెంటనే స్నానాలు చేయమని ఆజ్ఞాపించారు. బండివానిని పిలిచి బ్రతిమాలి బండి శుభ్రం చేయించారు. తిరిగి బండి యెక్కి గ్రామంలోకి పోయారు.

గ్రామస్తులు వారిని చూచి ఎంతో సంతోషించారు గ్రామ కరణంగారి యింటిలో బస ఏర్పాటు చేశారు. నాలుగురోజులు పిండి వంటలతో భోజనం పెట్టించారు గ్రామస్తులు పరమానందయ్యగారి తండ్రి, తాతలను ఎలా గౌరవించారో అలాగే వారినికూడా గౌరవంగా చూశారు శక్త్యానుసారం ధనం, ధాన్యం పప్పులు, బట్టలు ఇచ్చిసన్మానించారు గురుదంపతుల్ని గ్రామస్తులను ఆయురారోగ్య భాగ్యములతో వర్ధిల్లమని ఆశీర్వదించి ఆనందంగా తిరిగిస్వగ్రామం చేరుకొన్నారు.

## శిష్యులు చేసిన శాంతివైద్యం

ఒక గ్రామంలో రామయ్య అనే వ్యాపారస్తుడు వున్నాడు. అతనికి పరమానందయ్యగారంటే ఎంతో భక్తి, పరమానందయ్యగారి తండ్రి, తాతలకాలం

నుండి కుటుంబ గురువులు. అందువల్ల ఆయన పరమానందయ్యగారిని దైవసమానంగా భావిస్తున్నాడు. ఆయన మాట వేదవాక్యంగా భావించి పాటిస్తాడు. అప్పుడప్పుడు ఆయన పరమానందయ్యగారి వద్దకు వచ్చి తృణమో పణమో యిచ్చి వెళుతూ వుంటాడు.

రామయ్య తన గ్రామంలో వడ్డీ వ్యాపారం చేసేవాడు. కిరాణాదుకాణం బట్టల దుకాణం నడిపేవాడు. అనేక అబద్ధాలు ఆడి, మోసాలుచేసి విశేష ధనం, భూమి సంపాదించాడు. కానీ భార్యా పిల్లలు దక్కలేదు. నా అనే దిక్కులేక, గ్రామస్తులతో, సరిపడక మనసు బాగులేనప్పుడూ, ఏదయినారోగం వచ్చినప్పుడూ పరమానందయ్యగారి వద్దకు వెళ్ళి, రెండురోజులు ఉండి పోతుండేవాడు.

ఇలా జరుగుతూ వుండగా ఒకసారి రామయ్యకు కడుపునొప్పి పట్టుకొంది ఎన్నాళ్ళయినా తగ్గలేదు. మంచం పట్టాడు. తన స్థితి పరమానందయ్యగారికి ఉత్తరం ద్వారా తెలియజేసి ఒకసారి రమ్మని ప్రార్థించాడు.

రామయ్య ఉత్తరం చదువుకొని పరమానందయ్యగారు శిష్య సమేతంగా మరునాడు అతని గ్రామం వెళ్ళారు. గురువుగారిని చూచి రామయ్య చాలా మర్యాదచేసి తన బాధను గురించి వివరంగా చెప్పాడు. పరమానందయ్యగారు "నేను వచ్చానుగదా భయపడకు! ఇదొక గొప్ప రోగమా? దీనికి నా శిష్యులు చికిత్స చేయగలరు. రెండు రోజులలో నీ సమస్త బాధలూ తీరిపోతాయి. నిర్భయంగా వుండు" అని ధైర్యం చెప్పారు. శిష్యులను పిలిచి ఆయనకు చేయవలసిన చికిత్స గురించి వివరంగా చెప్పారు.

గురువుగారి ఆజ్ఞ దొరకడం తడవుగా ఒక శిష్యుడు తన సంచిలోవున్న శొంటి పొడుము తీసి కాస్త పంచదార కలిపి రోగికి యిచ్చాడు గోరువెచ్చని నీళ్ళు త్రాగించాడు. ఆ విధంగా మూడు పూటలు యిచ్చేసరికి రామయ్యగారికి కడుపు



శిష్యులు రామయ్యకు చికిత్స చేయుట

నొప్పి తగ్గి ఆకలి పుట్టింది. రామయ్య చాలా సంతోషించాడు. రెండవ రోజున మరొక శిష్యుడు శొంటి మెత్తగా దంచి కషాయం కాచి త్రాగించాడు. రామయ్య శరీరమంతా వేడి పుట్టింది. మూడవరోజున మరొక శిష్యుడు శొంటి

గంధం తీసి రామయ్య శరీరమంతా పట్టించాడు. దాంతో రామయ్య శరీరమంతటా మంటలు పుట్టాయి. ఆ బాధ భరించలేక రామయ్య గట్టిగా ఏడవనారంభించాడు. పరమానందయ్యగారు "భయపడకు! రోగం తగ్గేముందు అలాగే వుంటుం"దని ధైర్యం చెప్పారు. రామయ్య నిజమే కావచ్చుననుకొని మంటను ఓర్చుకొంటున్నాడు నాలుగవనాడు మరియొక శిష్యుడు శొంఠినూరి ముద్దచేసి రామయ్య నడినెత్తిమీద వేసి కట్టుకట్టాడు ఉన్న బాధలు చాలక తలపోటు పట్టుకొని పిచ్చిగా అరుస్తూ బాధ పడసాగాడు.

అతని స్థితి చూచి పరమానందయ్యగారు శిష్యులను పిలిచి కొంప ముంచారు. రామయ్య చచ్చేస్థితిలో వున్నాడు. బాగా ఆలోచించి చికిత్స సాగించమన్నారు గురువుగారి మాటలు విని శిష్యులు చాలా బాధపడ్డారు. ఇంత కష్టపడి చికిత్స చేస్తుంటే గురువుగారు మెచ్చుకోవడంలేదని ఆగ్రహించి "గురువుగారూ! మీరేం దిగులుపడకండి. రామయ్య చచ్చినా అతని ప్రాణాలుమాత్రం పోనియ్యం" అని వాగ్దానం చేశారు.

రాత్రి శిష్యులంతా కలసి ఆలోచించసాగారు. మనం ఎన్ని రకాల చికిత్సలు చేసినా రోగం తగ్గలేదు. రోగం తగ్గినా తగ్గకపోయినా ప్రాణం పోకుండా చూడాలి అని నిశ్చయించుకొన్నారు. ఒకనాడు ప్రాణం ఎటువేపునుంచి పోతుందో తెలుసు కోవాలన్నాడు. మరొకడు తెలుసుకోడానికేముంది? కడుపులోనుంచి పోతుంది అన్నాడు. ఇంకొకడు ముక్కులోనుంచి పోతుందన్నాడు. వేరొకడు కళ్ళలోంచి పోతుందన్నాడు. ఈ విధంగా తలకొక విధంగా చెప్పి ఎటూ నిర్ధారణ చేసుకోలేక పోయారు. వారిలో ఒక బుద్ధిమంతుడు యిలా చెప్పాడు. "మన శరీరంలో నవ రంధ్రాలున్నాయంటారు. ఆ రంధ్రాలను వెదకి మూసివేస్తే ప్రాణం ఎటూపోలేక చచ్చినట్టు పడివుంటుంది" అన్నాడు. అతని బుద్ధి కుశలతకు అంతా మెచ్చు కొన్నారు.

తమ వద్దనున్న శాంతినంతా తీసి మెత్తగా దంచి ముద్ద చేశారు. రామయ్యను బలవంతంగా కదలకుండా పట్టుకున్నారు. అతని నవరంధ్రాలలో శాంతి ముద్దకూర్చారు. ఎప్పుడయితే నోరు, ముక్కు రంధ్రాలు మూసివేశారో అప్పుడే అతని పంచప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. కదలక మెదలక పడి వున్నాడు. అతను బాధ తగ్గి హాయిగా నిద్రపోతున్నాడని శిష్యులనుకొన్నారు. మంచం చుట్టూ కూర్చుని కునుకుతున్నారు.

తెల్లవారింది గురువుగారు నిద్రనుంచి మేల్కొని రామయ్య వున్న గది లోనికి వచ్చారు. మంచంవద్దకు వెళ్ళి రామయ్య చెయ్యిపట్టుకుని నాడిచూశారు. గుండెమీద చెయ్యిపెట్టి చూశారు. "కొంప మునిగింది! రామయ్య చనిపోయాడు. లేవండిరా! వెధవల్లారా." అని బిగ్గరగా అరిచారు. శిష్యులు గురువుగారి కేకలు విని ఉలిక్కిపడి లేచారు. తాము చేసిన ఘనకార్యం గురించి చెప్పబోయారు. "మీ తెలివి తక్కువ వైద్యంవల్ల రామయ్య చనిపోయాడు. ఎవరయినా ఈ సంగతి తెలుసు కొంటే చావగొట్టి చెవులు మూస్తారు. ఇతనికి దహన సంస్కారాలు చేయించాలి. కావలసిన వాళ్ళెవరూ లేరు. ఇరుగు పొరుగు వారికి ఈ సంగతి చెప్పి తీసుకొని రండి" అని పంపారు.

రామయ్య అంటే ఆ ఊళ్ళో వున్న వారందరికి చాలా కోపంగా వుంది. "వాడు చస్తే మాకేం బ్రతికితే మాకేం? మేము రాము" అని కబురు చేశారు. అంతట పరమానందయ్యగారు అతని శిష్యుల సహాయంతో దహన సంస్కారాలు జరిపారు. రామయ్యకు అంతకుముందే తాను చనిపోయిన తరవాత తన ఆస్తి అంతా తమ గురువుగారయిన పరమానందయ్యగారి మఠమునకు యిచ్చేస్తానని వాగ్దానం చేశాడు. వీలునామా వ్రాసిపెట్టాడు. దానిప్రకారం రామయ్య ఆస్తిని గైకొని శిష్య సమేతంగా స్వగ్రామం బయలుదేరారు.

## శిష్యులను చూచి నవ్విన చిన్నది

స్వగ్రామమునకు వచ్చుచుండగా వారికి దారిలో ఒక తోట కనబడింది. వారు నడిచివస్తూ చాలా అలసిపోయారు. అందువల్ల కొంతసేపు ఆ తోటలో కూర్చుండి పోదామనుకొన్నారు. గురువుగారు ఒక చెట్టునీడలో ప్రక్క వేసుకొని పడుకొన్నారు. వారు తోటలో అటూ యిటూ తిరుగుతూ క్రిందపడివున్న పళ్ళు ఏరుకుని తింటున్నారు.

ఆ సమయంలో తోటమాలికూతురు అక్కడికి పువ్వులు కోసుకుందామని వచ్చింది. శిష్యులా కన్యను చూచి దగ్గరకుపోయి "నీ పేరేమిటి? ఇక్కడి కెందుకు వచ్చావు? చిలక కొట్టిన జామపండు కావాలా" అని తలొక విధంగా మాట్లాడ నారంభించారు. ఆ చిన్నది వారికేం సమాధానం చెప్పకుండా చిరునవ్వు నవ్వి పారిపోయింది.

శిష్యులు ఎవరికివారు తనను చూచే ఆ పిల్ల నవ్వింపని భావించారు. "నన్ను చూచి నవ్వింది" అంటే "నన్ను చూచే నవ్వింది" అని వాదించుకోవడం మొదలు పెట్టారు. వాదన ముదిరింది. ఒకరినొకరు తిట్టుకోవడం, కొట్టుకోవడం ప్రారంభిం చారు వారి కేకలతో తోట మారుమ్రోగి పోతున్నది. గురువుగారు త్రుళ్ళిపడి లేచారు.కళ్ళు నులుముకుని కొట్లాడుకుంటున్న శిష్యుల మధ్యకు వెళ్ళి "మీకేం పోయే కాలమొచ్చిందిరా? ఇలా కొట్టుకుంటున్నా రెందుకు? ఎవరయినా చూస్తే నా పరువు ప్రతిష్ఠలు మంట కలిసిపోతాయి. ఆగండి, ఏం జరిగిందో చెప్పండి" అని గట్టిగా అరిచారు.

అంతా వచ్చి గురువుగారి పాదాలమీద పడ్డారు. జరిగిన సంగతంతా చెప్పి "ఆ చిన్నది నన్నే చూసి నవ్వింది" అంటూ పన్నెండుమందీ అన్నారు. మళ్ళీ

వాదించుకోనటం మొదలుపెట్టారు. గురువుగారు అతికష్టముమీద వారిని శాంతింప చేసి "నేను స్వయంగా వెళ్ళి మీలో ఎవరిని చూచి ఆ చిన్నది నవ్విందో తెలుసుకుని వస్తాను. అంతవరకూ మౌనంగా ఉండండి" అని బయలుదేరి తోటంతా వెదికి ఒక



శిష్యులు "నన్ను చూచి నవ్వింది" అంటూ చిందులు తొక్కుటం

గుడిసెలోవున్న అమ్మాయిని చూచి "ఓ చిన్నదానా! తోటలో కనబడిన నా శిష్యులను చూచి నవ్వినావట! వారిలో ఎవడినిచూచి నవ్వావో కాస్త చెప్పమ్మా" అని అడుగగా, ఆ చిన్నది "అయ్యా! వారి మాటలు, వాలకాలూ

చూసి పిచ్చివాళ్ళనుకొన్నాను మా తోటలో పడిన పళ్ళు తింటూ నాకు పెడతానంటే నవ్వు వచ్చింది. వారికేం చెప్పాలో తోచక, నవ్వుకొంటూ వచ్చేశాను. నేను ఏ ఒక్కణ్ని చూసి నవ్వలేదు" అని చెప్పింది.

పరమానందయ్యగారు శిష్యుల వద్దకు వచ్చి "ఒరే! ఆ చిన్నది మీ మాటలూ, చేష్టలూ చూచి మిమ్మల్ని పిచ్చివాళ్ళనుకొని నవ్విందట! అందరినీచూచి నవ్వింపట కాని ఏ ఒక్కరినిచూచి కాదట" అని చెప్పారు. గురువుగారి మాటలు విని శిష్యులంతా "నేను పిచ్చోణ్ని" అంటె "నేను పిచ్చోణ్ని" అంటూ తోటంతా తిరగసాగారు పరమానందయ్యగారు వారిని అతి కష్టంమీద ఆపి, తమతో తీసుకు పోయారు.

పరమానందయ్యగారు స్వగృహంచేరి కొన్నాళ్ళు ఇంటిపనులు చక్క-బెట్టుకున్నారు. తరవాత భార్యతో రామయ్య యిచ్చిద స్థలంలో మఠం కట్టడమా మానడమా అని ఆలోచించారు. సుందమ్మగారు మఠం నిర్మించడానికి అంగీకరించారు. నిర్మాణం పూర్తి అయ్యేవరకూ అక్కడే వుండాలని నిశ్చయించుకున్నారు. ఒక శుభ ముహూర్త సమయాన వారి శిష్యులను, ఆహార పదార్థములు మొదలగు వానిని తీసుకొని బయలుదేరారు.

రామయ్యగారు యిచ్చిన ధనంతో, వారు యిచ్చిన స్థలంలో మఠం కట్టిస్తూ వున్నారు. చాలా దినములు గడిచిన తరవాత సుందరమ్మగారికి పరమానంద పురంలో ఇల్లు ఎలా వుందో, ఇంట్లో వున్న ధాన్యం వగైరాలు ఎట్లా వున్నాయో అనే సందేహం కలిగింది. వెంటనే భర్తను పిలిచి, "శిష్యులను పంపి తమ యిల్లు ఎలా వున్నదో చూచిరమ్మనండి, ఇంట్లో ఎలుకలు దూరకుండా తగు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసి రమ్మనండి" అని చెప్పారు. "ఔను! నేను యింటి సంగతే మరిచి పోయాను. బాగా జ్ఞాపకం చేశావు. ఇప్పుడే పంపుతాను" అని చెప్పి శిష్యులను

పిలిచి నాయనలారా! మీరు మన గ్రామమునకు వెళ్ళి మన ఆశ్రమం ఎలావుందో చూచిరండి. ఆశ్రమంలోవున్న ధాన్యం వగైరాలను ఎలుకలు తినివేయకుండా తగు ఏర్పాట్లు చేసిరండి అని చెప్పారు.



శిష్యులు ఎలుకలతో పోరాడుట

గురువుగారి ఆజ్ఞననుసరించి పన్నెండు మంది శిష్యులూ పరమానందపురం బయలుదేరారు వారు కొంతదూరం నడిచీ, కొంతదూరం పరిగెత్తి యిలా ప్రయాణం సాగించి పరమానందపురం చేరారు. వారు గురువుగారి ఇంటికి చేరేసరికి చీకటి పడింది.

చాలా రోజుల నుండి ఇంటిలో ఎవరూ లేనందున ఎలుకలూ, పంది కొక్కులూ నిర్భయంగా ఇంటిలో నివసించనారంభించాయి. అవి యింటిలోవున్న సామానులను చిందరవందరగా పడవేశాయి. ధాన్యాన్ని మెక్కి పొట్టలు పెంచుకున్నాయి. బట్టలు కొరికి పాడుచేశాయి, ఈ విధంగావున్న యింటిలో ప్రవేశించటానికి శిష్యులు భయపడ్డారు. సుందరమ్మగారు యిచ్చిన అటుకులూ, బెల్లం తిని, గ్రామస్తుల నడిగి మంచినీళ్ళు త్రాగివచ్చి రాత్రంతా అరుగుమీద పడుకొన్నారు.

## శిష్యుల ఎలుకల వేట

తెల్లవారుజామున అంతా లేచారు. ఇంట్లోకిపోయి చూశారు. వారినే మాత్రం లెక్కచేయకుండా తిరుగుతున్న ఎలుకలను, పందికొక్కులను చూచి ఆగ్రహపడ్డారు. కర్రలతో బెదిరించారు. కన్నములలో పొడిచారు. ఒక కన్నములో పొడిస్తే మరొక కన్నం నుండి వచ్చి తిరుగుతున్నాయి. అలా మధ్యాహ్నంవరకు చేసి బాగా అలసిపోయారు అరుగులమీదకూర్చుని అలసట తీర్చుకొన్నారు. అంతా కలసి ఆలోచించారు. మట్టిపెట్టి ఎలుకల కన్నములను మూసివేయాలని నిశ్చయించుకున్నారు. సాయంత్రం వరకూ అలా చేశారు. ఎలుకల బాధ తీరిందని తృప్తిపడ్డారు. అటుకులు, బెల్లంతిని, నీళ్ళుత్రాగి ఆకలి తీర్చుకున్నారు. ఇంటిలో వున్న కిరసనాయిలు దీపంలో పోసి వెలిగించారు. చాపలు పరుచుకొని పడుకొన్నారు.

అర్ధరాత్రి వరకూ హాయిగా పడుకున్నారు. అప్పుడు వారిమీద, వారి అటుకులమీద ఎలుకలు దండయాత్ర సాగించాయి. అటుకులన్నీ తినివేశాయి. అంగవస్త్రాలను కొరికివేశాయి. చివరికి వారి కాలి వ్రేళ్ళను కూడా కొరికాయి.

ఎలుకలు, పందికొక్కులు యిలా విహారం చేస్తుండగా వారికి మెలకువ వచ్చింది. తెల్లవార్లూ వాటితో పోరాడారు. తీరా చూస్తే వారు మూసివేసిన కన్నాలన్నీ యథా ప్రకారం తెరువబడి వున్నాయి. వాటిని చూచి వారు తెల్లబోయారు. ఏం చేస్తే ఎలుకలు పోతాయా అని ఆలోచించసాగారు.

## ఇల్లు తగలబెట్టి ఎలుకల బాధ తీర్చిన శిష్యులు

ఆలోచించగా, ఆలోచించగా వారికి ఒక ఉపాయం తోచింది. కన్నాలలో గడ్డికూరి, కిరసనాయిలుపోసి అంటిస్తే ఎలుకలు చస్తాయి, ఇక ఎలుకలబాధ తప్పు తుంది అనుకొన్నారు. దొడ్డిలో వున్న ఎండు గడ్డి తెచ్చి కన్నాలలో కూరారు. సాలో వున్న కిరసనాయిలు పోసి అంటించారు. వీధి బయటకు వచ్చి నిలబడ్డారు. కన్నాలలో పెట్టిన ఎండుగడ్డి గాలికి ఎగురుతూ పైకిపోయి ఇంటి కప్పుకు తగిలినది. బాగా ఎండిన తాటాకులతో కప్పబడిన ఆ ఇంటికప్పు సులభంగా అంటుకొన్నది. ఆ మంటలను చూచి శిష్యులు చిందులు త్రొక్కుతూ, "ఎలుకల్లారా కాలండి! పంది కొక్కుల్లారా మాడి చావండి!" అని అరుస్తున్నారు.

నిద్రపోతున్న గ్రామస్తులు అర్ధరాత్రి సమయంలో ఈ అరుపులేమిటో అనుకొని ఇళ్లనుండి బయటకు వచ్చి చూసేసరికి పరమానందయ్యగారి ఇల్లు తగల బడుతూ వుండటం కనిపించింది. "అరే, గురువుగారి ఇల్లు కాలిపోతున్నది. రండి! నీళ్ళు తీసుకురండి! అర్పుదాం రండి!" అని ఒకరినొకరు పిలుస్తూ కాలుతున్న ఇంటి వద్దకు వచ్చి ఆర్పబోవుచుండగా శిష్యులు అడ్డుపడుతూ "ఆర్పకండి! ఎలుకల బాధ పోగొట్టటానికి మేమే మంట పెట్టాం" అని చెప్పారు.

వారి మాటలు విన్న గ్రామస్తులకు ఎంతో కోపం వచ్చింది. "ఎలుకల బాధ పోగొట్టటానికి ఇల్లు తగలబెడతారా? ఎవరు చెప్పిన బుద్ధి ఇది?" అని శిష్యులను పట్టుకొని చావగొట్టసాగారు. శిష్యులు వారి దెబ్బలకు ఆగలేక నాలుగు వైపులకూ



గురువుగారి యింటికి నిప్పు పెట్టిన శిష్యులు

పారిపోయారు. కొంతసేపటికి అంతా ఒకచోట కలుసుకొని "మనం ఇక్కడ వున్నామంటే గ్రామస్తులు చంపేస్తారు. గురువుగారి దగ్గరకుపోయి చెపుదాం పదండి!" అని నిశ్చయించుకుని బయలుదేరారు.

శిష్యులు అతివేగంగా వెళ్ళి పరమానందయ్యగారి పాదములపైపడి నమస్కరించి ఏడ్వనారంభించారు.

గురువుగారికి వారు యెందుకు యేడుస్తున్నారో అర్థంకాలేదు. "నాయనలారా! మీరు ఎందుకు ఏడుస్తున్నారో నాకు వివరంగా చెప్పండి!" అన్నారు. అంతట వారు అచటనుండి వెళ్ళి ఇల్లు శుభ్రంగా ఉంచటానికి చేసిన ప్రయత్నమునంతా పూసగ్రుచ్చినట్లు చెప్పారు. "మేము చేసిన పని గ్రామస్థులకు ఎందుకు నచ్చలేదో వారు మమ్మల్ని ఎందుకు తరిమి కొట్టారో మాకు అర్థంకాలేదు" అన్నారు.

ఆ మాటలు విన్న సుందరమ్మగారు గుండె బాదుకొంటూ "సర్వం నాశనం చేశారు. చూసి రమ్మంటే కాల్చి వచ్చారు. ఈ వెధవల్ని పట్టుకొని ఆ మంటలో పడేస్తే బాగుండును, పీడ విరగడైపోవును. మన గ్రామస్థులు వీళ్ళను ఎందుకు వదిలేశారో?" అని బిగ్గరగా అరుస్తూ చెప్పారు. "ఇక మీ ముఖాలు మాకు చూపించవద్దు. ఎక్కడికయినా పోయి బ్రతకండి." అని ఖండితంగా చెప్పారు. గురువుగారు భార్య మాటలకు అడ్డు చెప్పలేకపోయారు. ఆయనకు కూడా శిష్యులమీద కోపం వచ్చింది తాతలనాటి కొంప తగులబెట్టిన ఈ శిష్యులను దగ్గర పెట్టుకుంటే యింకా ఏ అఘాయిత్యాలు చేస్తారో అని భయపడి ఊరుకొన్నారు.

శిష్యులు గురువుగారి ముఖంవేపు చూచారు. ఆయనకూడా కోపంగానే వున్నారని గ్రహించారు. అప్పటికే రెండు రోజుల నుండి తిండితిప్పలు లేక బాధ పడుతున్నారు! తూలిపోతున్నారు. గురుపత్ని వారిని కళ్ళెర్రచేసి చూస్తూ "మీరు ఇక క్షణంకూడా వుండవద్దు. ఎక్కడికయినా పోయి చావండి" అని కసిరి కొట్టు

నారంభించగా, చేసేదిలేక వారు ఒకరి మొక మొకరు చూచుకుంటూ వూరి చివరకు పోయారు. అచ్చటవున్న చెరువునీరు త్రాగి దాహం తీర్చుకొన్నారు.

"ఇప్పుడు మనం ఎక్కడికి పోవాలి! ఎలా బ్రతకాలి?" అని ఆలోచించ సాగారు.

ఇంతలో ఒక కొంటెపిల్లవాడు అచ్చటికి వచ్చి "ఏం చిన్నయ్యగారూ! ఇక్కడెందుకున్నారు? రామయ్య దయ్యమై రాత్రి వేళ యీ ప్రాంతంలో తిరుగు తున్నాడట. ఇక్కడికి రాకండి! పారిపోండి" అని చెప్పి గబ గబ వెళ్ళిపోయాడు.

## పలాయన మంత్రం పఠించిన పరమానందయ్య శిష్యులు

ఆ మాటలు విన్న శిష్యులు మూలుగుతున్న నక్కపై తాటిపండు పడి బాధించినట్లు బాధపడ్డారు. భయంతో గజ గజ వణికిపోయారు. "రామయ్య దయ్యమైతే మనల్ని పట్టుకొని బాధించక మానడు" అనుకొని తలొకదారి పట్టి పారి పోయారు తిరిగి వారా ప్రాంతానికి రాలేదు.

మరునాడు పరమానందయ్యగారికి శిష్యులు జ్ఞాపకం వచ్చారు. "అయ్యో! పాపం! రాత్రంతా ఎక్కడున్నారో. ఏం తిన్నారో!" అని జాలిపడ్డారు. సుందరమ్మ గారికి కూడా చాలావరకు కోపం తగ్గింది. సొంత పిల్లల్లా చూచుకొంటున్న శిష్యులు కనబడనందుకు ఆమెకు ఏమీ తోచడం లేదు. మనసు ఆగక భర్త వద్దకు వచ్చి "పాపం మన కుర్రకుంకలు ఏమయ్యారోనండి? నిన్నటి నుంచి తిండి కూడా లేదు,

"ఏం తిన్నారో? ఎక్కడున్నారో?" అని జాలిపడుతూ అడుగగా పరమానందయ్య గారు "మనం ఏం బాధిస్తామో అనుకొని భయపడి ఎక్కడికో పారిపోయి వుంటారు అలా పోయి చూసి వస్తానని బయలుదేరి ఊరంతా గాలించారు. కనబడిన ప్రతి



దెయ్యమనే మాట విని పారిపోతున్న శిష్యులు

వారినీ "మా శిష్యులు కనబడ్డారా?" అని అడిగారు. కనబడలేదని చెప్పారు ఊరు చుట్టుపట్లవున్న తోటలలో కూడా చూశారు. ఎక్కడా వారు కనబడలేదు. నిరాశతో యింటికివచ్చి "వాళ్ళు ఈ చుట్టుప్రక్కల ఎక్కడా లేరు, ఎవరి నడిగినా

కనబడలేదని చెప్పారు. పాపం! ఎక్కడికి పోయారో'' అని భార్యకు చెప్పారు ''ఒకవేళ మన వూరికి కాని వెళ్ళారేమోపోయి తెల్సుకురండి!'' అన్నారు సుందరమ్మగారు. ''నాలుగు రోజులు చూసి వెళతాను ఇక్కడి మఠం పనికూడా పూర్తికాలేదు సగంలో విడిచిపెట్టి ఎలా పోతాం'' అన్నారు. ''సరే! అలాగే చేయండి!'' అన్నారు సుందరమ్మగారు.

శిష్యులు కనబడనందుకు పరమానందయ్యగారు బెంగపెట్టుకొన్నారు. తిండి కూడా సరిగా తినడంలేదు. క్రమంగా ఆయన ఆరోగ్యం పాడైంది. ఆయన పరిస్థితి చూచి సుందరమ్మగారు దిగులుపడ్డారు.

శిష్యులు ఎన్ని అవకతవక పనులు చేసినా, ఎన్ని కష్టనష్టాలు కలిగించినా పరమానందయ్యగారు కన్నబిడ్డలవలె ప్రేమిస్తూ అపరంగా చూస్తూ ఉండేవారు. సుందరమ్మగారు కూడా వారుచేసే పనులకు ఒక్కొక్కప్పుడు కోపం పట్టలేక తిట్టినా వెంటనే మరచిపోయి, వారిని ఆప్యాయంగా చూస్తూండేవారు. అందువల్ల వారు కనిపించకపోయేసరికి ఉభయులకూ బాధగానే వుంది. పరమానందయ్యగారు వారి వియోగం భరించలేక మనోవ్యాధితో మంచం పట్టారు.

ఇలా ఒకనాడు పరమానందపురంలో ఉన్నారని, ఇరుగు పొరుగు గ్రామాల్లో బిచ్చమెత్తి జీవిస్తున్నారని, వారి స్థితి చూస్తే దుఃఖం కలుగుతుందని, పిచ్చివాళ్ళలా తిరుగుతున్నారని, నేను రమ్మని ఎంత నచ్చచెప్పినా ''మేమక్కడికి

రాం. రామయ్య అనే వర్తకుడు దయ్యమయ్యాడట! వాడు మమ్మల్ని పట్టుకుని బాధిస్తాడు. కనుక మేము రాము అని చెప్పారు." అని తెలియజేశారు.

రైతు మాటలు విని పరమానందయ్య దంపతులు కూడా భయపడ్డారు. శిష్యులు ఏ స్థితిలోవున్నా బ్రతికివున్నారని తెలుసుకుని సంతోషించారు. రామయ్య దయ్యమయ్యాడనే మాటవిని భయంతో వణికిపోయారు. అది నిజమో అబద్ధమో తెలుసుకుందామని కూడా వారు అనుకోలేదు. వెంటనే పరమానందపురం పోయి, ఇల్లు బాగుచేసుకుని, శిష్యులతో అక్కడే వుండిపోదామని నిశ్చయించుకున్నారు.

మరునాడే వారు సామాను సర్దుకుని రైతు తెచ్చిన బండిలో స్వగ్రామానికి బయలుదేరారు. మఠం నిర్మాణం మధ్యలోనే ఆగిపోయింది. స్వగ్రామానికి బయలుదేరే ముందు ఆ గ్రామస్తులకు చెప్పనేలేదు.

## సతీ సమేతంగా స్వగ్రామం చేరిన పరమానందయ్యగారు

పరమానందయ్యగారు సతీ సమేతంగా స్వగ్రామం చేరుకున్నారు. మూడురోజులు రామాలయంలో వుండి, తమ ఇల్లు బాగుచేయించుకున్నారు. మరునాడు శిష్యులు ఒక్కొక్కరూ వచ్చి గురువుగారి పాదములపై పడి తమ తప్పులు క్షమించమని ప్రార్థించారు. వేళకు తిండి తిప్పలులేక సగమైపోయిన శిష్యులను

చూచి సుందరమ్మగారు జాలిపడి కంటతడి పెట్టుకొన్నారు. "తప్పు చేస్తే కొడుకుల్ని మాత్రం తిట్టమా? అలాగే మిమ్మల్ని తిట్టాం. కోపం పట్టలేక పొమ్మన్నాం అంత మాత్రానికే మీరు మమ్మల్ని విడిచిపెట్టి వచ్చి యిలా కష్టాలు పడుతున్నారా? వచ్చే ముందు మాకు చెప్పనయినా చెప్పారుకారు" అని అడిగారు.

సుందరమ్మగారి మాటలు విని శిష్యులు ఇలా చెప్పారు. "అమ్మగారూ! మీరు పొమ్మని తిట్టినప్పుడు మేం ఊరి బయట వున్న చెరువు వద్దకు పోయి కూర్చున్నాం. అప్పుడొక పిల్లవాడు వచ్చి "రామయ్య దయ్యమయ్యాడు. ఇక్కడ వుంటే మిమ్మల్ని పట్టుకుని బాధిస్తాడు. కనుక ఇక్కడినుంచి పారిపోండి" అని హెచ్చరించాడు. అప్పుడు మాకు ఏంచెయ్యాలో తోచలేదు. మీరుచూస్తే పొమ్మని చెప్పారు. రామయ్య చూస్తే దయ్యమయ్యాడు. ఇక మమ్మల్ని ఆదరించే దిక్కు లేక ఇక్కడికి వచ్చి బిచ్చమెత్తుకుని బ్రతుకుతున్నాం" అని చెప్పగా సుందరమ్మ గారు జాలిపడి "ఎంత కష్టపడ్డారా! ఇప్పటి నుంచయినా బుద్ధిగా వుండండి! గురువు గారి ఆరోగ్యంకూడా బాగులేదు. వారి సేవచేస్తూ మామూలు ప్రకారంగా వుండండి" అన్నారు.

సుందరమ్మగారి మాటలు విని శిష్యులు ఎంతో సంతోషించారు. "బుద్ధి గానే ఉంటామమ్మా!" అన్నారు. వారి మాటలు విని పరమానందయ్యగారుకూడా సంతోషించారు.

తమ శిష్యులు తిరిగివచ్చి తమదగ్గర వుంటున్నందుకు పరమానందయ్య గారు సంతోషపడ్డారు. కాని ఆయన ఆరోగ్యం మాత్రం రోజు రోజుకు పాడైపో తున్నది. పైకి లేవలేకుండా వున్నారు. సుందరమ్మగారూ, శిష్యులు తగుసేవలు చేస్తున్నారు. ఎంత చేసినా పరిస్థితి బాగుపడలేదు. పరమానందయ్యగారికి బ్రతుకు తాననే ఆశ పోయింది. శిష్యులూ, సుందరమ్మగారూ రాత్రింబగళ్ళు ఆయనకు తగు సేవలు చేస్తున్నారు.

పరమానందయ్యగారు ఏ వైద్యుని వద్దా మందు తీసుకోనడం లేదు. ఇంతవరకు తమకు తెలిసిన మందులన్నీ వాడారు కాని ప్రయోజనం లేకపోయింది. ఒకనాడు ఆయన మందు చేయుటకు పిప్పళ్ళు కావలసి వచ్చాయి. ఒక శిష్యుణ్ని పిప్పళ్ళు తీసుకురమ్మని పంపుతూ అలాగే శొంటి, కరక్కాయలు, మిరియాలు వగైరాలు దుకాణంలో వున్నాయోలేదో తెలుసుకు రమ్మన్నారు. శిష్యుడు వేగంగా వెళ్ళి పిప్పళ్ళు కొన్నాడు. శొంటి సంగతి మాత్రం అడిగాడు. మిగిలిన వస్తువుల పేర్లు మరిచిపోయాడు. పిప్పళ్ళు తెచ్చి గురువుగారికి ఇచ్చాడు. శొంటి వుందని చెప్పాడు. మిగిలిన వస్తువులున్నాయా అంటే అడగటం మరచిపోయానన్నాడు.

అప్పుడు గురువుగారు "ఒరే తెలివితక్కువవాడా! అలా వుంటే ఎలారా! ఒక పనే గురించి చెప్పితే నాలుగు పనులు చక్కబెట్టుకుని రావాలి! దుకాణానికి పోయినప్పుడు ఏయే వస్తువులు దొరుకుతాయో, ధరవరలు ఎలా వున్నాయో తెలుసుకుంటూ వుండాలి. తెలివి అంటే అది! ఇంతకాలం నుంచి బోధిస్తున్నా మీకు ప్రపంచ జ్ఞానం బొత్తిగా కలగలేదు!" అని మందలించారు. ఆ సమయంలో శిష్యులంతా అక్కడే వున్నారు. అంతా ఇక ముందు అలాగే చేస్తామన్నారు.

ఉన్నట్టుండి పరమానందయ్యగారికి వాతంవల్ల కాళ్ళు చేతులు చచ్చుపడిపోయాయి. మాట పడిపోయింది. సుందరమ్మగారికి ఏమీ తోచలేదు. శిష్యులను పిలిచి పొరుగూళ్ళోవున్న వైద్యుణ్ని తీసుకురమ్మని చెప్పారు ఆమె భర్త వద్ద ఏడుస్తూ కూర్చున్నారు.

కొందరు శిష్యులు పరుగున పరుగున పొరుగూళ్ళోవున్న వైద్యునివద్దకు వెళ్ళి "మా గురువుగారు చాలా ప్రమాదస్థితిలో వున్నారు. అమ్మగారు మిమ్మల్ని పిలుచుకుని రమ్మన్నారు" అని చెప్పారు. ఆ వైద్యునికి పరమానందయ్యగారంటే గిట్టేదికాదు. ఆయన బాగునప్పుడు చుట్టుప్రక్కల గ్రామస్తులంతా వెళ్ళి మందు తీసుకొనేవారు. ఆ వైద్యునివద్దకు వూళ్ళోవాళ్ళుకూడా సరిగా వెళ్ళేవారు కాదు. అది మనసులో పెట్టుకుని "నేను రాను పొండి!" అని చెప్పాడు.

శిష్యులు ఆయన కాళ్ళమీదపడి "మా యందు దయయుంచి మా గురువుగారు ప్రాణాలు కాపాడండి" అని బ్రతిమాలారు. ఆయన తప్పించుకొనే ఉద్దేశంతో "వంద రూపాయలు యిస్తే వస్తాను లేకపోతే రాను" అన్నాడు. "అలాగే యిస్తాం రండి" అని బ్రతిమాలి తీసుకొని బయలుదేరారు. ఈ లోపుగా కొందరు శిష్యులు ఎందుకయినా మంచిది లోగడ గురువుగారు ఒకపని చెపితే నాలుగు పనులు చక్క బెట్టుకొని రావాలన్నారు. కనుక పనిలో పని తయారుగా ఉంచుకుంటే మంచిదని తలచి వెదుళ్ళు, పిడకలు, కొత్తకుండ, కట్టెలు తీసుకువచ్చి వీధి అరుగు క్రింద పెట్టుకొని కూర్చున్నారు.

సుందరమ్మగారికి సహాయంగా వున్న శిష్యులు పరమానందయ్యగారికి గుండె కొట్టుకుంటున్నదో లేదో చెయ్యిపెట్టి చూశారు. వారికి గుండె కొట్టుకుంటున్న జాడ తెలియలేదు. సుందరమ్మగారితో "అమ్మా! గురువుగారి గుండె కొట్టుకోవడం లేదు, చనిపోయారు" అంటూ బిగ్గరగా ఏడవనారంభించారు. సుందరమ్మగారు వారి మాటలు నమ్మి గుండె కొట్టుకుని ఏడవనారంభించారు.

సుందరమ్మగారు కొంతసేపటికి తేరుకుని "నాయనలారా! చనిపోయిన వారిని యింటిలో వుంచడం మంచిదికాదు. వీధిలోనికి తీసుకొనిపోయి పడుకో బెట్టండి" అని చెప్పగా శిష్యులు మంచముపై స్పృహలేక పడివున్న గురువుగారి తల కొందరు, కాళ్ళు కొందరు, నడుము కొందరు, చేతులు కొందరు పట్టుకుని వీధి లోనికి తీసుకొనిపోయి పరుండబెట్టారు.

అదే సమయంలో పొరుగూరి వైద్యుడు శిష్యులతో కలిసి గుర్రపుబండిలో ఆ గ్రామం వచ్చారు. ఆయన కొంతదూరంలో వున్న పరమానందయ్యగారి ఇంటిని, ఇంటిముందు పరుండబెట్టిన పరమానందయ్యగారి శరీరాన్ని, ఇటూ అటూ వున్న వెదుళ్ళు, కొత్తకుండ, పిడకలు, కట్టెలరాశి చూచి "పరమానందయ్యగారు చని పోయారు. ఇక నేను వచ్చి లాభమేమిటి? మీరు పోయి ఆయనకు అంత్యక్రియలు జరిపించండి" అని శిష్యులకు చెప్పి, బండి వెనుకకు త్రిప్పించి వచ్చిన దారిన వెళ్ళిపోయాడు.

## పరమానందయ్యగారి పరలోక యాత్ర

వైద్యుని మాటలు విని శిష్యులు గొల్లుమని ఏడుస్తూ పరుగు పరుగున పోయి పరమానందయ్యగారి చుట్టూ కూర్చొని ఏడవనారంభించారు. సుందరమ్మ

గారు వారిని చూచి "వైద్యుడు రాలేదా?" అని ప్రశ్నించగా "వైద్యుడు మాతో ఇక్కడకు వచ్చారు. దూరం నుండి గురువుగారి శరీరమును చూచి "ఆయన చనిపోయారు. ఇక నేను వచ్చి లాభమేమిటి? మీరు పోయి ఆయనకు అంత్యక్రియలు జరిపించండి, అని చెప్పి వెనుకకు తిరిగి వెళ్ళిపోయారు" అని చెప్పారు.

ఆ మాటలు విని శిష్యులంతా గురువుగారు మరణించారని నిశ్చయించుకొన్నారు. భర్తయొక్క చలనం లేని శరీరాన్ని చూచి సుందరమ్మగారు కూడ ఆయన చనిపోయాడని నిశ్చయించుకొని కొంతసేపు ఏడ్చి, శిష్యుల సహాయంతో అంత్యక్రియలు జరుపుటకు సిద్ధపడ్డారు.

శిష్యులు గురువుగారిని పాడిపైనుంచి కట్టి స్మశానానికి తీసుకుపోయారు. చితిపైవుంచి నిప్పు ముట్టించారు. కొంతసేపయిన తరవాత గురువుగారి శరీరం కదిలింది. మూలుగు వినిపించింది. అది చూచి శిష్యులు భయపడ్డారు. గురువుగారు దయ్యమై పోయారని తలచి అక్కడినుంచి పారిపోయారుగాని గురువుగారు ప్రాణంతోనే వున్నారని వారు అనుకోలేదు.

ఏది ఎమయితేనేం మొత్తానికి గురువుగారు శిష్యుల అజ్ఞానంవల్ల బ్రతికి వుండగానే చనిపోయారు. చనిపోయి ఆయన ఏ లోకంలో వున్నారోగాని శిష్యులు మాత్రం తలొక గ్రామంలో భిచ్చమెత్తుకొని తిని బ్రతుకుతున్నారు. సుందరమ్మ



ఇంటిముందు పరుండబెట్టిన పరమానందయ్యగారినీ,
కట్టెలు మున్నగు వానిని చూచి వెళ్ళిపోతున్న వైద్యుడు

గారు గ్రామాలలోవున్న పరమానందయ్యగారి శిష్యవర్గం సహాయంతో శేషజీవితం గడుపుతున్నారు.

★ ★ ★

# మా స్వంత ప్రచురణలు



బొమ్మల శ్రీ షిర్డీ సాయి జీవిత చరిత్ర

” అక్బర్ బీర్బల్ వినోద కథలు

” తెనాలి రామకృష్ణుని కథలు

” ఆలీబాబా 40 దొంగలు

” అల్లావుద్దీన్ అద్భుతదీపం

” గలివర్ సాహసయాత్రలు

” శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న కథలు

” భట్టి విక్రమార్క సాహస కథలు (2 భాగాలు)

” భేతాళ కథలు

” మొగల్ సామ్రాజ్య కథానాయకులు

” ప్రవక్త మహమ్మద్

” ఏసుక్రీస్తు కథలు

” మదర్ థెరిసా

” రవీంద్రనాథ్ ఠాగూర్

” యోగి వేమన

” భగత్‌సింగ్

” అంబేద్కర్

” యశపాల్ కపూర్

” భగవతీచరణ్

” సుభాష్ చంద్రబోస్

” జయప్రకాష్ నారాయణ్

బొమ్మల సంఘ సంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ
" పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" పరమానందయ్య శిష్యులు
" శ్రీ వెంకటేశ్వర లీలలు
" శ్రీ అయ్యప్ప లీలలు
" శ్రీ రామపట్టాభిషేకం
" జై వీరహనుమాన్
" పల్నాటి వీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తి మహాత్మ్యం
" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీయాదగిరి నరసింహస్వామి చరిత్ర
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగ లీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు